గూర్చి దాపరికము అవసరము ఉండదు. సత్యేతరములయిన వాగ్వ్యవహారము సన్మార్గ విరోధి. నన్ను ద్వేషించు వారిమీద గూడ నా ప్రేమ ప్రవహించునుగాని, దాని మార్గము వింతగా వుండును. సత్యము గ్రహించుటకును, మరుగు పరుచుటకు శక్యము కానిది....సర్వత్ర శాంతి సౌఖ్యములు కలుగుటకే నేనిది వ్రాయగోరితిని. బ్రహ్మాండము విరిగి నా మీద పడినా నా నిశ్చయమునుండి నా మనసు చలింపదు. మానవ కోటి అంతా నాకు ప్రతికూలమై నన్ను గర్హించుటకు సిద్ధపడినా సర్వ ప్రాణనాథుడు నన్ననుగ్రహించుట గుర్తించుచున్న నాకు తొట్రుపాటుండదు. అందరము కుశలము. ఇది చాలా ఒడుదుడుకులు జరుగుటకు ఉపక్రమ కాలము. వచ్చే వైశాఖమునుండి ఇక ఎంతో తీవ్రముగ........తప్పదు. జవాబు వ్రాయుడు. చి॥ శంకరముకు కవరు చేరిన సంగతి వెంటనే వ్రాయుడు. అందుకే ఇది వ్రాస్తున్నా.

వే॥ ప్ర.

మ.రా.రా. చల్లా సూర్యనారాయణరావు పంతులుగారు, ముక్త్యాల, కృష్ణాజిల్లా.

9—2—40

[జాబు నెం. 12]

4, వెంకటరంగంపిళ్లై వీధి

ఆశీర్వచనములు ఉభయకుశలోపరి.

మీ జాబులు చేరినవి. మీకు కొంత సుగుణముగా ఉన్నందుకు సంతోషము.

ఎన్ని ఆపదలలోగాని, ఎట్టి దుర్వార దుఃఖములో గాని, నిజముగా రక్షింపగలది ఈశ్వరానుగ్రహము. తక్కినవి దానికి లోబడినవే. నిర్వికల్పముగా ఈశ్వరానుగ్రహమును విశ్వసించి ప్రార్థించుచు ఇతర సహాయములు పొందినను నా కంత బాధ యుండదు. భగవదనుగ్రహము గూర్చి, వెగటు, రోత, విసుగు కలుగరాదు. ఎంత విపరీత పరిస్థితులలో ఉన్నా ఆవిశ్వాసము విడరాదు. అట్టి పరిస్థితులు మన (అహంకార కృతములు) లోనివి; పవిత్రత, శుచి, ఆరోగ్యము ఈశ్వర మయము. అవి తదనుగ్రహముననే మనకు లభింప వలెను.

వడిగా మీ ఆరోగ్యము చక్కబడు గాక యని నా ప్రార్థనము. నేనిప్పుడు పడుచున్న యిబ్బందులలో మీ యిబ్బంది లెక్కలోక లెక్కగాదు. నావంతు నేను, మీ వంతు మీరు అనుభవింపవలసినవే కదా! పరస్పర కష్ట సమీకరణ శక్తిని లోక మింకను గుర్తింపజాలకున్నది. అది వుండీ వుండనట్లు, పనిచేసీ చేయనట్లు ఉన్నది. నేను 2, 3 రోజులలోనే ఏమో తిరుపతి వెళ్తాను. కుటుంబాదికము తర లించుట ఎప్పుడగునో! సి వి.వి కృప.

మీ మిత్రులెవరో వచ్చి ఉత్తరమిచ్చి వెళ్లిరి. మీ ఆరోగ్యము సరిగా లేదని చెప్పిరి. అంతే. అప్పుడు నే నితరులకు ట్రీట్ చేయుచున్నాను. నడుమ వారు కొంత చికాకు కూడ కలిగించిరి కబుర్లు సాగించి, ట్రీట్ చేస్తూ ఉండగా గ్రహించవలెను

వే ప్రభాకరశాస్త్రి

*To, K. Venketeswar Rao, 4 th cross Road, Brodipet, Guntur.*

*　　　　*　　　　*

[జాబు నెం. 14]

ఆనందాశ్రమము
కరణాల వీధి
తిరుపతి
28—7—40

ఆశీర్వచనములు

ఉభయకుశలోపరి.

మీరు, నేను విశాఖ పట్టణమునుండి బెజవాడ వచ్చి తిరుపతి ప్రయాణమగు చుండగా మీరు వ్రాసిన జాబొకటి బెజవాడకు వచ్చినది. అది నాకు చేరినది, ఇంకొక జాబు నేనెఱుగను - తొలి జాబులో మీరు బాపట్ల వెళ్ళుచున్నట్లు వ్రాసి తిరి. వచ్చి మరల వ్రాస్తారు గదా అని బదులు వ్రాయలేదు. కొంత అశ్రద్ధ. జాబు వ్రాతలో — ఇదే కారణము - మీరూ బాపట్ల వెళ్లి వచ్చి జాబు వ్రాయలేదు.

మీ యందరి క్షేమమునకు సంతోషము. మీ కాలి బాధ అట్లే ఉన్నందుకు వగచుచున్నాను. భగవంతుడు మిమ్ము ఆరోగ్యవంతుని గావించుగాక అని వేడు చున్నాను సి.వి వి. భార్యగారు అటువచ్చి కొన్నాళ్లుండుట సంతోష విషయము. "మంత్రములు" వగైరాలు పనికి రావనుటలో ఏ మంత్రములు? 'అది యింతకు ముందు సహించినది' అంటిరి? అది అనగా ఏది? 'ఇకముందు అట్లు చేసిన అపాయ మున్నది' అన్నవార్త నే వినజాలను. అది పాపిష్ఠపు మాట! సి. వి. వి. నా వల్ల ఎవ్వరికి అపాయము జరుగదు అనిరి. నేను దుర్వాసో విశ్వామిత్రాదులవంటి వాడగా ననిరి. ఎట్టి యపమార్గమున నున్నవానిని గూడ సంస్కరించుటే గాని, దండించుట నా పనిగా దనిరి. బాధలు వారి వారి కర్మల వల్ల వచ్చినవి గాని దానికి కర్త సి వి.వి కానేరదు - ఇది నా నిశ్చయము. ఇంతదాక "ఏల సహింప వలసెను? ఇక మాత్రమేల సహింప రాదు?'' ఏదైన జాబు....పై వారి ద్వారా పంపుట మంచిది'' అన్న నర్థమేమి? పైవారనగా ఎవరు? ఎవరు ఎవరికి జాబు వ్రాయుటలో ఏ పై వారి ద్వారా వ్రాయవలెను? మీ వాక్యములు నా కర్థము కాలేదు. శక్యమైతే సవిస్తరము జాబు వ్రాయండి నేను ఎవరెవరినో శిష్యులను చేర్చితినని, నేను మాష్టరు నయితినని, ఏమేమో వ్యవహారములు [1] ఆయమగారి సన్నిధిని జరిగినట్లు వింటిని. నే నందరకు శిష్యుడను. నేను గురువును గాను. నే నెవరినీ శిష్యులను జేర్చలేదు. నన్నెవరైనా మాష్టరు అంటే దుఃఖపడుదును.

నేనేదో మూల, అపరిజ్ఞాతుడనుగా ఒదిగి ఉందునుగాక! నాకేల ఈ తగ వులు? లోకములో ఇంకా నిర్వికల్పముగా సత్యము నెలకొనలేదు.

చి తగించవలెను.

వే. ప్ర

3—12—44

తిరుపతి

చిరంజీవ ! ఉభయకుశలోపరి.

30 వ తేదీ మద్రాసు రేడియో ప్రసంగమునకు వెళ్ళినాను. 2 వ తేదీ తిరిగి వచ్చినాను. అందరం క్షేమము. నాకు సంబంధించినవిగాని, యోగమార్గమునకు

సంబంధించినవిగాని, విషయములు అడిగినా వారికివీరికి తెలిపితే వారు, వీళ్ళు మతిచెడి ఉన్నారుసుమా, ఆశాస్త్రుర్లు వీళ్ళమతి చెడిచినాడు సుమా అనుకోవడం సంభావ్యము. జాగ్రత్తగా వ్యవహరించండి. శ్రీ లక్ష్మీనారాయణ పంతులుగారు[2] నాకు వ్రాయనక్కరలేదు. వారి పుణ్యాసాధ్వికి ఆరోగ్యము కలుగుగాక ! తథ్యము. వెల్లడయ్యేదాకా నన్ను నన్నుగానే ఉండనివ్వండి. చి॥ రామకోటయ్య జాబు వ్రాసినాడు. అందులో వింత విషయము ఉన్నది. సరిగా ఇక్కడ జరిగిన అసాధారణ విషయము అంతా అతనికి ఆ నాడే అగపడినది. ఏమి ఇది జరిగిన విషయము తెలుపండి అని వ్రాసినాడు. ఆనాటి చి॥ గురు, భాష్యం, సచ్చిదానంద ములు[3] వాళ్ళ డైరీలు అతనికి వ్రాసి పంపుతారు. వీటితో ఏమిటి! ఎన్నో విశేషాలు వ్యక్తమవుతున్నవి. గ్రహించవలెను.

వే. ప్ర.

తిరుపతి

28—3—46

శ్రీ వెంకటేశ్వరరావుగారికి

ఆర్యా! వందనములు శ్రీ గురుదేవులు ప్రభాకరశాస్త్రిగారు, వారి తమ్ముడు శ్రీ శంకరశాస్త్రిగారి అల్లుడు శ్రీ పురుషోత్తముగారు స్వర్గస్థులగుటచే చాలా చీకాకుగానున్నారు. వారిలో నీ షాకు మూలముగా సముద్రమథనమంత పని జరిగినది. తత్ఫలితమే ఈ జాబుతో గూడ మీకు పంపిన వారియనుభూతి వృత్తాంతము ఇది మీరు చదివి, శ్రీ రామకోటయ్యగారి[4] గూడ పంపుదురుగాక యని కోరుచున్నాను. శ్రీ రామకోటయ్యగారికి ఆరోగ్యము గురించి ఉత్తరము వ్రాయగలరనితలచెదను. మీక్షేమాదికము తెలుపగోరుచున్నాను. ఈకాగితము లను ఉత్తరము వ్రాసి మీకు శ్రీ శాస్త్రిగారు పంపమనిరి.

చిత్తగింపుడు,

విధేయుడు

శతి॥ కోదండరామయ్య

18. 3. 45 తేదీ మధ్యాహ్నము తిరుపతి నుండి తొందరలేని మనస్సు తోనే బయలుదేఃతిని. 19.3.45 తేదీ మదరాసులో చిరంజీవి తమ్మునిజాబు (కుంభకోణమునకు టికెట్ కొన్నతర్వాత) చూచి యేమి యసందర్భము జరుగునా యని వెఱచి ట్రీట్ చేసితిని. మధ్యాహ్నము మూడు గంటలకు దుర్భరమైన తాపము కలిగెను. ఇట్లు 5గం॥ దాక జరిగినది. భోజనముచేయతోచలేదు. భోజనములేకయే భగవంతునిపై భారమువైచి కుంభకోణము వెళ్ళితిని 20 3. 45 తేదీరాత్రి ట్రీట్‌మెంటు రిసీవ్ చేసికొన్నట్లు తెలియలేదు. మాష్టర్స్ రికాలింగ్ ప్రొసెస్‌కోసమై , అనగా 'మాతృశ్రీ'గారి సౌమంగల్యప్రాప్తికై ) మాకును, మా ద్వారా లోకమునకును 'ఎటర్నటీ' ప్రాప్తికై సెంటరుకు పెళ్ళి నేనుండి నప్పుడే యనర్థము జరుగునాయన్న యుచ్ఛ్వాసముతో నానాటిరాత్రి ప్రాక్టీసు జరిపితిని. 21 3.45 తేదీ ఉదయము చి॥ సుందరమూర్తి వ్రాసిన యుత్తరము వచ్చినది నిమ్మళముగా నున్నదని. మధ్యాహ్నము చి॥ రామచంద్రరావుగారి జాబు వచ్చినది. చి॥ సుబ్బయ్యకు[7] నెమ్మదిగానున్నదని ఆనాడు విచారము మరచిపోయి యున్నాను. సాయింకాలము నిర్విచారముగా 'ప్రాక్టీసు' చేసినాను. 23.3.45 తేదీ మధ్యాహ్నము ఇంటికి వచ్చి ఈ దౌర్భాగ్యమంతా వింటిని. ఇట్లేల జరుగవలెనను విచారమునకు సమాధానమునకై యంతరంగ మూరకే చుమ్మలు చుట్టుకు పోవడము మొదలుపెట్టినది. 23,24 తేదీలు అల్లకల్లోలముగా అంధకారములో ఉన్నాను. 25.3.45 తేదీ మధ్యాహ్నము అతివిచారము, దుఃఖము. కాలేజీలో ఉండలేక పోయినాను. ఇంటికి వచ్చి యేడుస్తూ కూర్చున్నాను. "సర్వం దుఃఖం దుఃఖం సర్వం శూన్యం శూన్యం'' అనిపించింది. ఏమీతోచకుండా మళ్ళీకాలేజీకి వెళ్ళాను. అక్కడేదో ఓ అరగంట గడిపి మళ్ళీ ఏడుస్తూ కూర్చున్నాను. ప్రాక్టీసు టైమయినది. ప్రాక్టీసు చేసుకున్నా ఏమీ శాంతిలేదు. అందరూ వెళ్ళినారు. నాకు 'బెజవాడ యెందుకు వెళ్ళకపోతినా' యని విచారము. ఎట్టిచిక్కులు వచ్చినా కుంభకోణము వెళ్ళవలెనని యంతకు పూర్వమే నెల నుండి నిశ్చయమేర్పడుట యేమి? దాని వలన లాభమేమి? అని చింత. బెజవాడవెళ్ళి నేను దగ్గర ఉండి ట్రీట్‌చేస్తే జీవించి యుండునేమో! మోసమయ్యెగదా! యని దుఃఖము. నిరంతరము ఆరాధించు ఈశ్వరశక్తి నన్నిట్లు వంచింపనేల? ఇటువంటి స్థితికి పరిణ

మింపదగిన వ్యవహారములో నన్ను ప్రవర్తింపజేసి, శ్రీ అప్పారావుగారిని, నన్ను ఇందు కార్యకర్తలుగా నిలిపి నిర్వహించి యిట్లు నెత్తినడుపనేల? ఇత్యాది విచారము. అపుడు ఈ క్రింది విషయములు తోచినవి.

"కొలది రోజులలో మీడియములలో గొప్ప మార్పు జరుగవలసియున్నది. ఆ గొప్ప మార్పులను పొందవలసినవారిలో నీవొక ముఖ్యుడవు. ఆ మార్పులు జరిగించుటకుగాను నీలో వెలయవలసిన దివ్యసంకల్పములు నీకింక నందకున్నవి. ఏవేవో వ్యవహారములలో నీవు నలిగుచున్నావు. ఎంత తీవ్రమయిన 'షాక్' నీవు పొందవలసియుండుట పూర్వకర్మానుభవము కూడను చనిపోయినపిల్లవాడు అలని సంబంధులు ఎంవరో ఆకర్మానుభూతిలో అంశాంశ ధాక్కులు. ఆ కర్మ తంత్రములు వేర్వేరుగా గుర్తింపవలసియున్నవి. సి.వి.వి. శిష్యుడవైన నీవీసమయమున అతని ప్రేమానుబంధులలో నొక్కడవై చిక్కుకొని సెంటరులో దివ్య సంకల్పముతో నుండి ట్రీట్ చేయుచుండగా నాతడు శరీరమును విడుచుట బట్టి యాజీవుని నీవు సి.వి.వి. కస్టడీలో నుంచుటైనది. సి.వి.వి. అవతారము జరుగునప్పుడు రీకాల్ చేయబడేవారిలో నాతడు నొకడు కాగలడు. ఇందులో నీ తీవ్ర సంకల్పము ప్రయోజకము.

అయితే ఆ పిల్లవాడు తిరిగి రీకాలో చేయబడుట తథ్యమగునా? సి.వి.వి. రీకాలో చేయబడుట తథ్య మనుకొనుచుంటివా ? లేదా ? సత్యమని నమ్మియే నేనుచ్ఛ్వసించుచున్నాను.

అది సత్యమేని యిదీ సత్యమే. శ్రీ అప్పారావుగారి భార్య రీకాల్ చేయబడుట గూర్చి ఆమె చనిపోయిన మూడవరోజున నీయనుభూతిని స్మరింపుము.

అట్టిచో శ్రీ అప్పారావుగారి భార్యవలెను, ఈ కుఱ్ఱవానివలెను, నాకు అత్యంత ప్రేమ పాత్రములు, నన్ను, నాద్వారా సి.వి.వి. అనుగ్రహమును విశ్వసించువారు, నాచే ట్రీట్మెంటు పొందినవారు, ముఖ్యులింకా కొందరున్నారే ? వారి విషయము ? వారి విషయము ఇట్టిదే. వారి యనుబంధము (తల్లియో, తండ్రియో, భార్యయో, బిడ్డలో) ఇహమున నున్నచో నీ సంకల్పము వారిని శరీరముతో రప్పింపవలెనని యుండి, అది వారిని సి.వి.వి. కష్టడీలో నుంచినచో

వారును రీకాల్ చేయబడుదురు. అందు మీ మీ (నీ యొక్కయు, అభేదము పడసిన తక్కిన ముఖ్యశిష్యులయు) సంకల్పములే ప్రమాణములు. నీయాప్తులు నీ మూలమున రీకాల్ చేయబడుదురు. డి.ఏ ఎన్.[8] ప్రభృతులిట్టివారే; అయితే పూర్వయుద్ధమున 1914 సం. మొదలు మూడేండ్లు నేను భయంకరానారోగ్యములో నుండి సి.వి.వి. అనుగ్రహమున నారోగ్యము పొందితిని. నాటి యుద్ధమరణ వార్తలు నాకు దుర్భరముగా నుండెడివి. నిరంతరము దుఃఖగ్రస్తుడనైతిని. ఈ యుద్ధమున సి వి.వి. యనుగ్రహమున ఆబాధ తీవ్రముగలేదు. నిగ్రహశక్తి కలదు. కాని ప్రపంచమున ననేక లక్షలమంది దౌర్జన్యమునకు దాము కారణము కాకపోయినను, దౌర్జన్యమూర్తులగు మొనగాళ్లచేతులలోపడి చచ్చిపోయినారు. ఇంకా చచ్చిపోవుచున్నారు. వారి తల్లులు, భార్యలు, పిల్లలు, 'అలో లక్ష్మణా' యని ఏడ్చుచున్నారు. వారి దుఃఖములు నాకు దరచుగా గోచరించుచుండును. ఎంతో అనుతాప పడుచుందును. అవియును ఇప్పుడు నా తమ్ముని కుమార్తె మొదలగు వారి దుఃఖముల వంటివేనే. డిసైపుల్స్ దుఃఖములు తీరునేని, డిసైపుల్స్ కుటుంబముల దుఃఖములు తీరునేని, వారి యాప్తుల దుఃఖము తీరునేని, యూరపు మొదలగు దేశములలోని యార్తనాదములు కూడ తీరవలెను

యుద్ధమున జచ్చిన వీరపురుషులెల్ల 'రీకాల్' చేయబడవలెను. ఇది నా కోరిక. ఇది నా సంకల్పము వారిని నా యాప్తులుగానే భావించు చున్నాను. అందుకు పర్యాప్తమయిన సంకల్పము కలవాడవు కమ్ము. అట్లు చేయగలవు. అయితే హిందూ దేశములో సత్యాగ్రహమున నెందరో జైళ్ళలో, బయట, పాప సంకల్ప రహితులే చచ్చిరి. చంపబడిరి. వారు ? వారినీ 'రీకాల్' చేయుటకు నీ సంకల్ప బలమే సాధనము. వారేకాదు దొరతనము వారి సిబ్బంది కూడ ప్రజల దౌర్జన్యముచే కొందరు చంపబడిరి. అందును నిర్దోషులు రీకాల్ చేయబడుదురు. ఇంతే కాదు. 'కామెట్' రానున్నది. భూమిపై అధికమైన ఉష్ణము విజృంభించి పెక్కు విప్లవములు జరగవచ్చును. ఇంకనూ అసాధారణముగా హిందూ దేశములోనే యుద్ధజ్వాలలు చెలరేగవచ్చును. అందు మరణించిన వారు కూడ మీ మీ సంకల్ప బలముచే రక్షితులు గావలసియున్నారు. ఇపుడు భూమిపై పుట్టి మర్త్యుడవైతివి. సి.వి.వి. మీడియముతనము పడసితివి. మాష్టరు తనము పడయనున్నావు. నీవు నిర్వర్తింప వలసిన కార్యభారమును ఈ విపత్తుమూలమున స్పష్టముగా గుర్తించి, దానికి జాలిన సంకల్ప బలమును బడయుటయు సి.వి.వి. ముఖ్య శిష్యులలో

అభేద భావము (నీకు 10 రోజులకు ముందుగా గోచరింపించినది) నిండార్చు కొనవలసి యున్నావు. కొలది రోజులలోనే దీని తత్త్వమును నీవు అనుభూతి పూర్వకముగ తెలియ గలవు. ఈ నిశ్చయమును నీవు ముందు గుర్తించి యుంటేని మృత్యు ద్వారము నుండి నిత్యతా సౌధమునకు గంతువేయ గలవు. సర్వము నిర్వహింపగలవు. అయితే ఈ స్థితి ఎన్.ఆర్.బి వి.10 చెందెనా ? ఈ నడుమ చాల అలజడి ఆయన శరీరమున జరిగినట్లు వింటిని. అది ఇట్టిది యగునా ? అది ఆయన నడిగి తెలిసికొమ్ము మరియు ప్రతీక్షించి చూడుము. అయితే కొన్నాళ్ళ క్రిందట వెన్నుముక పై నుండి ఒక దివ్యే కుండలిని దగ్గరకేగి, కుండలిని చుట్టు ప్రదక్షిణము చేసినట్లు—ఇది కుండలిని లోనికి అరుగవలసి యున్నది—అన్నట్లు గోచరించి (నిద్రకాదు, స్వప్నము వంటి మెలకువలో 15 నిమిషములకు మించి) లేచి తినే దాని యనుభూతి ఏమి ? దానిక నీవు విలువ కట్టలేదుగదా.

సి.వి.వి. స్వరూపమును చూచి సెల్ఫ్ అడ్వైజు పడసేదాకా నాకు దృప్తి కలుగదు. సి.వి.వి. దర్శనముకలిగేదాకా తృప్తి కలుగ దన(కు)ము. ఇప్పుడు నీలో జరిగిన సంవాదము ఏమను కున్నావు? సెల్ఫ్ అడ్వైజ్ కాదా? కావచ్చును. కానీ సెల్ఫ్‌ను నేనింకా చూడలేదే? నిజమే: ప్రయత్నింపుము. ట్రైఎగెయిన్, చూడగలవు.

*My self and your self when met ie. realised together is our self. That is Comet-Co-met*

*   *

సి.వి వి.

యన్.ఆర్.బి.వి మాష్టరుతనము బడయుట నీవు గుర్తించితివా? ఆయన మాటలను సంపూర్ణముగ నీవు విశ్వసించు చుంటివా?

ఆయన ఇన్‌సియేషన్ చేయుయోగ్యతను, మాష్టరు తనమును నేనీక్షణమున కింకనూ గుర్తించలేదు. మాష్టరు పరబ్రహ్మమగుటనుగూడ నేనింతదాకా గుర్తించ లేదు. అది గుర్తించినచో నాకింక సందేహమే యుండును? యన్.ఆర్.బి.వి. అందరు శిష్యులకంటె సి.వి.వి. లైను స్వరూపమును అసాధారణముగ గుర్తించినవాడని, తొలితొలి రియలైజు చేయువారిలో మొదటివా డాతడే కాగలడనీ నేను

విశ్వసింతును. కానీ అదినేను సాక్షాదనుభవమున గుర్తించలేదు దాని యాథా ర్థ్యము గుర్తింపగలుగుటకై పరితపించు చున్నాను. ఆయనకు నాకీ గ్రంథము నకు అభేదమగుట నేనూహింతును. ఆయన ప్రజ్ఞలో నాడీ కొంత నిర్వాహము కావచ్చును. ఆయనను, ఆయననాడీని, వేరువేరు చేసి వ్యవహరించుట న్యాయము కాదనియే నా తలపు.

సి వి.వి. బ్రహ్మమగుట నేనెట్లు ప్రత్యక్షముగ తెలియలేదో, అట్లే నాడి అక్షరాక్షరము సత్యమగుట కూడ నే తెలిసికొనలేదు.

నాడిలో చెప్పినవి అట్లే జరుగవచ్చునని నిశ్చయమున్నదా? ఉన్నదనిగాని లేదని గాని చెప్పలేను. విశ్వాసముతో ప్రతీక్షించు చున్నాను. ఇప్పటివరకు(సి.వి.వి శరీరము విడిచిన తర్వాత)జరిగిన విశేషములకన్నిటికి నాడి నిస్సంశయముగా నుత్తేజకము. సి.వి.వి. దివ్యాను గ్రహమున లోనుండి జరుగు నుద్బోధములు, ట్రీట్‌మెంట్లు, వాని విశేషానుభూతులు నాకు మరీ యీ లైను మీద యఖండ విశ్వాసమునకు జీవగఱ్ఱలు. నా మాటమీద పూర్ణవిశ్వాసముగలవారు, నా ద్వారా సి.వి.వి, యనుగ్రహము పడసినవారు, కొన్ని వందలమంది యున్నారు. నిస్సంశయముగా మాష్టరు దర్శనము వడసి తత్త్వము పొందినవారుగా (యన్.ఆర్.బి.వి. గానీ, ఇంకెవరైనాగానీ) నాయనుభవమున తెలియవత్తురేని, వారి మూలమున మృత్యు రాహిత్యము నితరులకు సిద్ధమయ్యెనేని, నాయాప్త బృందమునంతను మర్నాడు వారి శిష్యతకు ప్రేరేపుదును. ఆ స్థితిదాక నేనీవిషయమున నుదాసీనుడనుగా నుందును.

వే. ప్ర

*  *

తిరుపతి

18.4.45

మహారాజ రాజశ్రీ వేంకటేశ్వరరావు చౌదరిగారి దివ్యసన్నిధికి విధేయుడు కోదండరామయ్య నమస్కరించి చేయు విన్నపములు.

ఆర్య !

మీరు వ్రాసిన యుత్తరము నిన్నటిదిన మందినది. నేను తమకువ్రాసిన

యుత్తరము చేరియుండు ననుకొందును. మీకు వ్రాసిన జాబుతోనే, శ్రీ గురుదేవు లకును మీ యుత్తరమునందు పెట్టి యుత్తరము వ్రాసితిని కానీ ఆనాటి సాయం కాలమే శ్రీరామకోటయ్యగారి కుమారుడు చనిపోయెనను పిడుగువంటి వార్త శ్రీ 'రవి'గారు వ్రాసిన యుత్తరమువలన తెలియగల్గితిమి. యువకులగు శ్రీరామ కోటయ్యగారి కింత చిరుతవయసుననే యిట్టి దుర్భర పరితాపము కలుగుటకు మేమెంతయు పరితపించితిమి. తన యారోగ్యము చక్కబడి సనిగా నున్నదన్న సంతృప్తితో నున్నవారికిది యొక దుర్భర పరితాపహేతువు! అనవరతదుఃఖ భూయిష్ఠమగు మానవ జీవితమును సుఖైకమయముగాజేయ సమర్థమగునది యొక్క సి.వి.వి. అనుగ్రహమే. మీరు సెలవిచ్చినట్లు వారి దివ్యానుగ్రహమునకై యే లోకమువేచి యున్నది.

తమ కింతకపూర్వము వ్రాసియున్న యుత్తరములో 8, 9, తేదీలలో నేదో దివ్యానుభూతి శ్రీ శాస్త్రిగారికి గలుగ గలదని, యందుకై ప్రతీక్షించు చుంటిరని వ్రాసియుంటిని ఆ దినములలో జరిగిన వృత్తాంతమిది. శ్రీ పురుషోత్తముగారి మరణ విషయమైవారికి కలిగిన యనుభూతి వృత్తాంతమును మీకును, శ్రీ శంకర శాస్త్రిగారికిని, శ్రీ అప్పారావుగారికిని బంపిరి. శ్రీ అప్పారావుగారిని దాని ఆంగ్ల మునకు భాషాంతరీకరణ చేసి పంపునట్లు కోరిరి. వారట్లేపంపిరి దానిని శ్రీ యన్.ఆర్.బి.వి. గారికి బంపవలయునని యుద్దేశించిరి. కాని దాని యాథార్థ్య మును శంకించి వారికి దాని బంపుట యందుపేక్షించిరి. ఇది 7వతేదీకి బూర్వము జరిగిన వృత్తాంతము.

7వ తేదీ యుదయము 'ప్రాక్టీసు' చేసికొనగా వారికి 'ఆక్షన్' జరుగలేదట. ఇట్టిస్థితి ఎన్నడును జరుగలేదట! అందుకు కారణము నన్వేషించుచుబోగా శ్రీ యన్ ఆర్.బి.వి. గారికి వానిని బంపకుండుటయే కారణమని తోచినది. ఆ తోచి నది నిజమగుచో నిక 'ఆక్షన్' జరుగవలెనని 'ప్రాక్టీసు' చేసికొనగా 'ఆక్షన్' దివ్యముగా జరిగినది. అంత నాదినమే శ్రీ యన్.ఆర్.బి.వి గారికా కాగితములను బంపిరి. అవి పంపిన తరువాత 8,9, తేదీలలో ననేక విషయములు, ఇనిషియే షన్ చేయు యోగ్యతకు సంబంధించిన రహస్యములు లోనుండి యొకటొకటిగా గోచరింపసాగినవట. వాని విషయమై శ్రీ యన్.ఆర్.బి.వి. గారితో కన్సల్ట్ చేయవలెననిరి. వెల్లూరు నుండి శ్రీ తాతి[11]గారు వచ్చి యుండిరి. ఈ విషయము

లను గురించి శ్రీ గురుదేవులును, వారును జర్చించుకొనిరి. ఈ విషయములను గురించి శ్రీ టి.యస్. రామానుజము[12]గారితో ప్రసంగించుటకై మదరాసువెళ్ళి యట నుండి ముక్త్యాల వెళ్ళవలెనని నిశ్చయించుకొనియుండిరి. కాని నేరుగా ముక్త్యాలకే వెళ్ళవలసి వచ్చినది.

ఇంకొక విషయము. ప్రపంచములో నేదోయొక మార్పుతోడి క్రొత్త సంవత్సరముప్రక్రమించునని సంవత్సరాదికి పూర్వము కొన్ని దినముల నుండి తెలుపుచు వచ్చిరి. అధిక చైత్ర శుద్ధ ప్రతిపత్తు నాడట్టిది యేదియు తెలియరాలేదు. సంవత్సరాదినాడు ఊరిలోని నలుగురు మిత్రుల ఇండ్లకు బోయి యభినందనముల దెల్పుట యాచారము. కాని యానాడట్లు, వెళ్లుటకును మనసు గొలుప లేదు. మొన్న నిజచైత్రశుద్ధప్రతిపత్తునా డదేమి దివ్యోద్బోధమో నూతన వస్త్రధారణము గావించి యానందముతో శ్రీ డా. శ్రీనివాసరావుగారి యింటికి వెళ్ళిరి. ఆశ్చర్యము! అచ్చటనే ప్రపంచమున నొక గొప్ప వ్యక్తి (*Roosevelt*) యొక్క యస్తమయము వినుట తటస్థించినది. నాటికి రెండు దినములకు పూర్వము నుండియే ఈ సంఘట నకు సూచనలు వారి దివ్యవాణిలో ధ్వనించు చుండెడివి!

శ్రీమతి మీ సతీమణిగారి యారోగ్యము చక్కగా నున్నదని విని మేము చాలా సంతోషించినాము వారి యారోగ్యమునకై శ్రీ వెంకట సుబ్బాశాస్త్రిగారు[14] మేము, ప్రతి దినము ప్రార్థించు చున్నాము. అప్పుడప్పుడు వారి యారోగ్యాభి వృద్ధిని గూర్చి యుత్తరములు వ్రాయుచుండ గోరినాము.

ఇచ్చట శ్రీ మాతృశ్రీగారు,[15] ఆనందు[16] మొదలగు వారు క్షేమముగా నున్నారు. శ్రీరామకోటయ్యగారికి గూడ నుత్తరములు వ్రాయుచున్నాను. తప్పులున్న క్షమింప గోరెదను.

నమస్కారములతో

25,26 తేదీలదాక సెలవు

శ్రీ గురుదేవులు ముక్త్యాలలోనే విధేయుడు

యుందురు. తి. కోదండరామయ్య

[ఈ లేఖ గురుదేవుల ఆదేశము చొప్పున వారి శిష్యులు వ్రాసినట్టిది-సం॥]

సర్వకర్తయౌ నీశ్వరేశ్వరుని దివ్య
తేజము వరేణ్యమును వినుతించు చుంటి
మిది సదా లోన నుండి మాకెపుడు మంచి
మంచి తలఁపులనే ప్రబోధించు దాన

శ్రీ గాయత్రి—
శ్రీ గురుదేవుల యాంధ్రీకరణము.

[ 6—5—48 నాటి మరియొక లేఖలో దిగువ నీ పద్యమున్నది —సం॥ ]

*కూర్చి వ్రాయవయ్య కోదండ రామయ్య
విడిగఁ బొడిగ నేను నొడువునుడుల
చక్కనొక్క జాబు జాగర్లమూడికి
వ్రాఁతగాఁడ ! మంచి కైతగాఁడ !

ఇది శ్రీశాస్త్రిగారు చెప్పిన పద్యము. వ్రాయుమనుటచే వ్రాసినాను.

— కొ.రా.

*

కవరు నెం. 29 తిరుపతి

*Dear Brother,* 14-7-45

ఇచట నందరము క్షేమంగా వున్నాము. నీ జాబు చేరి చాలా రోజులైనను సమాధానం వ్రాయమని గురువర్యులు నిన్ననే శలవిచ్చిరి. అందువల్ల ఈ దినం వుత్తరం వ్రాయుచున్నాను. ఈ క్రిందిభాగం శ్రీ గురువర్యుల వుత్తరంగా భావించేది (ఇది శ్రీ రామకోటయ్యగారి దస్తూరీతోగల జాబు)

తిరుపతి
13.7.45

చిరంజీవి! ఉభయకుశలోపరి. నేడుదయముననే టెలిగ్రామ్ వచ్చినది. నిన్న మధ్యాహ్నమే చి॥ సుబ్బారావు గుంటూరు వచ్చినాడు. నేడు మిమ్ములను కలసి కొనియుండును. కాలేజీ ఫీజు ముందుగానే కట్టి వేసి నందుకు సంతోషము. చి॥ సుబ్బారావు తండ్రి నేడు పంపిన మనియార్డరు రు. 100/- తిరిగి నీ పేర నేడే పంపినాను. అది నీవు తీసికొని అందు నీ సొమ్ము తీసికొని మిగత వానికిమ్ము.

ఇక ప్రస్తుతము

చి॥ నీ కుమారుని అనారోగ్యము యిప్పటికి సంపూర్ణంగా తొలగిపోయి యుండును. ఇక ఆరోగ్యవృద్ధి కలుగును. ఇంతదాక నేను ఎంత ప్రయత్నించినను వ్రాయజాలక పోతిని. నేడు వ్రాయ నుత్సహించి వ్రాయుచున్నాను. ఇక్కడ చికాకులన్నియు సర్దుకొని పోగలవని నమ్ముచున్నాను. చి॥ రామకోటయ్య క్రమ స్థిరారోగ్యము పొందుచున్నాడు. కొలది రోజులలో నిర్భయారోగ్య సిద్ధితో అక్కడకు రాగలడు. ఈ సదురు, అశాంతి తప్ప యోగ మార్గమున విశేషములేమి గోచరింపలేదు. తద్విషయకములైన జవాబులు రాలేదు.

ప్రపంచ శాంతి ఎండమావు చందముగా భ్రమగొలుపుచున్నదా యేమి యనిపించుచున్నది. ఒకటి రెండు రోజులలో రేఖామాత్రముగా నయిన శాంతి మార్గము గోచరించ గలదేమోనని ఎదురు చూచుచున్నాను.

పెట్టిచమ్ములాడు చెట్టగుల క్షమింపు
మీసడింప బోకు మెవని గాని
దేహమెన్ని నాళ్లో దీనికై మెట్టిమెఱ
లెవని తోడనేని యెందుకోయి.
ఇది గురువర్యుల లేఖ.

ఇక నా విషయము :—

నేను కులాసాగా వున్నాను. మధ్య మధ్య ఒకొకరోజు నిద్రపట్టక బాధ పుట్టుచున్నను ఆరోగ్యము క్రమశః వృద్ధియగుచున్నది. మీపిల్లలందరి క్షేమం తెలుపగోరెదను.

ఇట్లు సోదరుడు

రామకోటయ్య.
14. 7. 45.

16—6—45
తిరుపతి

ప్రియమిత్రునికి !

నేను 9 వ తేదీ యిక్కడకు వచ్చితిని. శ్రీ గురువర్యుల అనుగ్రహమువల్ల కులాసాగావున్నాను. ఇక్కడ కొంతకాలం మకాముపెట్టి బాగా ఆరోగ్యవంతుడ నైన పిదప యింటికి వత్తును. అందులకు ఇచట యిల్లు బాడుగకు తీసికొంటిని. కాకానినుండి కుటుంబమును గూడ రప్పించుకొందును. చి॥ మాధవుని, రాముని, చదువు బాగా సాగుచున్నదా ? శ్రీమతిగారి యారోగ్యమును కూర్చి గూడా వ్రాయుము. శ్రీలక్ష్మీనారాయణ పంతులుగారిని కలిసికొన్నప్పుడు నేను క్షేమంగా వున్నానని, నమస్కరించినానని చెప్ప ప్రార్థన. మనమనుకొనుచున్న పంపింగ్ స్కీమ్ విషయమేమయిన పని ఆరంభించితివో లేదో వివరంగా తెలియజేయుము.

ఇక కుంభకోణం విషయము :—అచట జరిగిన చర్చ విషయములు శ్రీ గురువర్యులు మాట్లాడిన విషయ వివరణలు టైపుచేయబడిన కాపీలు త్వరలో కుంభకోణం నుండి వచ్చును. రాగానే నీ కొక కాపీ పంపుదుము. అందులో చాల విషయములు తెలియగలవు. ముందు రెండు మూడు నెలలలో చాల గమనించ తగిన మార్పులు జరుగునని ఆశింపబడుచున్నది. 1946 సంవత్సరము మార్చికి

కామెట్ కనపడునని అక్కడ నుండి ప్రత్యక్షముగా మార్పులు జరుగునని, అట్టి అపూర్వమైన మార్పులు జరుగునని కూడ నమ్మకమేర్పడు చున్నదని శ్రీ గురువర్యులు సెలవిచ్చిరి.

ముక్త్యాల నుండి జాబు రాగానే గురువర్యులు ముక్త్యాల వెళ్ళివచ్చెదరు. అక్కడ జమీందారుగారితో ఈ యోగవిషయం మాట్లాడుదురు. అందు విషయమై ముక్త్యాల ఎప్పుడు బైలుదేరునది అక్కడనుండి వచ్చు జాబునుబట్టి యుండును.

ఇట్లు, సోదరుడు,
కొత్త రామకోటయ్య.

తిరుపతి
16-8-45

చిరంజీవ, ఉభయకుశలోపరి

నీ జాబులు చేరినవి. మీరందరు సుఖముగా ఉన్నందుకు సంతోషము. చి॥ రామకోటయ్య సుఖముగా ఉన్నాడు. సెప్టెంబరు తుదిదాకా ఇక్కడ ఉండ గోరినాను. భారత దేశము అధ్యాత్మ మహత్త్వము గలదా ? ఈశ్వరుడు కలడా ? అన్న సంశయములు తీరవలసిన ఆవశ్యకత ఏర్పడినది. ఇక నిరీశ్వర వాదము పండి పోగలదు. పశుబలము తాండవింప గలదు. అహింసా సత్యములు నెల కొనవలసి ఉంటే ప్రపంచము అంతా ఒక్క కుటుంబముగా పొసగ వలసి ఉంటే ఇక అల్పకాలములో ఈశ్వరానుగ్రహము వ్యక్తము కావలెను. ఏమికానున్నదో చూతము గాక ! అరండేలు చని పోవుట థియసాఫికల్ సొసైటీకి దెబ్బపెట్టే— ఏమి జరుగునో! నాకు కుంభకోణాదుల నుండి జాబులు ఈ నడుమ ఏమీ రాలేదు.

[గురువర్యుల ఈ జాబు ఇంతే కలదు. ముగింపు లేదు.]
కార్డు వెనుక

సోదరునకు :

నేను కులాసాగావున్నను చాలరోజుల నుండి నీకు ఉత్తరము వ్రాయుదమను

కొనుటయే గాని వ్రాయుటతటస్థించలేదు. మీ పిల్లలు, మీరు క్షేమమను కోరుదును, జాగర్లమూడి సంగతులు తెలియు చున్నవా !

నా భార్య, పిల్లలు జాగర్లమూడి వెళ్ళిరి. బహుశ రెండు మూడు రోజులలో తిరుపతి వచ్చెదరు.

ఇట్లు
రామకోటయ్య

తిరుపతి
15-10-45

చిరంజీవ, సుఖీభవ—ఉభయ కుశలోపరి.

ఈనాడు చాలా జాబులు వ్రాస్తున్నాను. ప్రతిదినము ఏదో అడ్డంకి. మీ దంపతుల యారోగ్యములు చక్కబడుట తెలుపగోరుచున్నాను. చి॥ రామకోటయ్య జాబు రాలేదు. సుఖముగ నుందురు. శ్రీ అప్పారావు గారికి జాబు వ్రాసినాను. వారి ఇంట నందరు సుఖముగ నున్నారని విశ్వసించుచున్నాను. ప్రసన్నముగ అప్యాయమానముగ నీ మనస్సు లేదని, అదే చికాకు కారణమనీ, మొన్న బెజవాడ వచ్చినప్పటి నుండీ అనుకుంటున్నాను. ఉన్న సన్నివేశములతోనే మనస్సు తెలుపికల్పించుకోవలయును గదా ! నీకు గల సుఖానందపరికరములులేనివా రెందఱున్నారో ఎంతెంత సంకట పరిస్థితులలో నలుగుతున్నారో చూచుకుంటే తెలుస్తుంది. నా మట్టుకు నేను *C.V.V.* అను గ్రహమనే అమృత భాండము లో నుంచుకొన్నాను గదా అన్న ఆనందోత్సాహముతో పొంగి పోతూ ఉంటాను. బాహ్య సంస్పర్శము అత్యంత సుఖప్రదము. మనకు లభిస్తూ ఉన్నదన్న పరితోషదోలలు హాయిగా ఊగులాడుతూ ఉండవలసిన వారమే మనమందరమూ. ఇది గుర్తింపని వారిని గూర్చి అనుతపింప వలసిన వారమే ! అందులోనే శాంతి సౌఖ్యములున్నవి. ఏమో వ్రాస్తున్నాను, నే బెజవాడ వచ్చిన నాటి నుండీ తిరిగి వచ్చిన దాదీ (రాజు వచ్చినాడు) ఎన్నో తీవ్ర యోచనలు సాగుతున్నవి. జనవరి తుదిలోగా ఈశ్వనాబ్దులోగా మే 29 లోగా చాలా

విషయములు మనలో వ్యక్తము కాగలవని నమ్ముతున్నాను. తదేక పరత మనలో నెలకొన వలెను. సరియయిన పరమార్థ మార్గములో నడుస్తున్నామన్న నిశ్చయము కలిగితే చికాకులన్నీ విచ్చిపోతవి. ఆ నిశ్చయము ఒక్కతూరిగలిగేది కాదు. ఎలుకమరపులుగా దృశ్యాదృశ్యములుగా వెనుకబడి ముందుకు దూకి లేదేమో అనిపించి ఉన్నదని దృఢీకరించి చిత్రచిత్రములుగా మనలను తీసుకు వెడుతుంది.

నే. ప్ర.

చిరంజీవ ! చిరంజీవ ! సు ! సు.

నీజాబులు చేరినవి. అందు చి॥ రామకోటయ్య చీటీగూడ చేరినది. మీ ఆరోగ్యమునకు సంతోషము. మీ కుమార్తె పడిగా సంపూర్ణారోగ్యము వదయుగాక, శ్రీ అప్పారావుగారు ఇక్కడే వున్నారు. ఇంట్లో అందరు క్షేమము. నాయారోగ్యము పూర్వము కంటే మంచి స్థితికి వస్తున్నట్లున్నది. ఆరోగ్యమును గురించి జాబు వ్రాయుటలో నీకున్న శ్రద్ధ నీ యనుచర మిత్రు డయిన చి॥ రామకోటయ్యకు గూడా కలుగుగాక యని కోరుచున్నాను. కవిత్వపు జాబులు మిత్రులకు సావకాశముగ వ్రాసినా నాకు మాత్రము సూటిగా ఆరోగ్య మాత్రపు వార్తతో తఱచు కార్డు మాత్రము వ్రాస్తూంటే సంతోషిస్తాను. ఈ మధ్య అతని జాబు రాక ఎట్లా వున్నాడో అని చాలా చికాకు పడ్డాను. మీ బావగారింట్లో సొమ్ము పోవడము, తిరిగి దొరకడము తీరు సవిస్తరముగా తీరిక దొరకినప్పుడు వ్రాయమను. చి॥ కోదండరామయ్య ప్రభృతులు క్షేమంగా ఉన్నారు.

[ఇది కోదండ రామయ్యగారి దస్తూరీలో వెళ్ళన జాబు]

16.11.45. (*Sd*) వేటూరి ప్రభాకరశాస్త్రి.

టు,

కె. వెంకటేశ్వరరావు, గుంటూరు.

తిరుపతి
7—2—46

చిరంజీవి : ఉభయకుశలోపరి.

నీ రెండు కవర్లు చేరినవి. చి॥ రామకోటయ్యతో సందర్భములన్నీ వివరించినాను. అతడు సవిస్తరము తెలుపునని, ఇక్కడి అలజడులలో విశ్రాంతి కుదరక వేరే జాబు వ్రాయలేదు. ఎన్నో చికాకులు మనలో నుండి వెడలి పోవలసి ఉన్నవి. వానిని గుర్తిస్తూ జాగ్రత్తగా అడుగు వేసుకుంటూ నడవ వలసి ఉన్నది. నేను సుస్తీగా ఉండగా రాత్రులకు రాత్రులు నాతో బాధపడిన నిన్ను నే నెన్నడు అన్యథాభావించను. చి॥ మీ పిల్లవాని ఆరోగ్యము ఎట్లున్నదీ వ్రాయుము. నా సన్నిధిని నీవు ఉండగా ఎన్నో పొరలు తొలగగా జరగవలసిన శ్రేయము అది అని తోస్తుంది. నేను ఇనిసియేషన్ చేయడమనేది *C.V.V.* పునరవతరణము—(వారి స్వరూప దర్శనము నాకు) కలిగినప్పుడే. కలిగితేనే- అనగా మృత్యు రాహిత్యపు తలపు ఫలించుట అది. చి॥ రామకోటయ్య అనేక విషయములు చెప్పగలడు.

గ్రహించవలెను
వే॥ ప్ర.

టు,
కె. వెంకటేశ్వరరావు, గుంటూరు

శ్రీ
సి. వి. వి.

చిక్కవోలు
31—8—47

చిరంజీవులకు శుభాశీస్సులు.

గొల్లప్రోలు నుంచి నా రాక ఆలస్యమై 4 దినముల క్రిందటనే ఇచ్చటికి వచ్చినాను. నీ కార్డు అందుకొని అపరిమిత సంతోషము పొందినాను. పొందు చున్నాను. జెండాపాట[17] ఎంతైనా బాగున్నదని వేరే వ్రాయవలెనా? దానిలోని వన్నీ అమృతవాక్కులు అన్నీ ముక్కలూ ముఖ్యమైనవే. పేపర్లలో చూడవచ్చు

నన్ను నీ ఉపన్యాసం నేను చూడ జతపడలేదు. దేనిలోపడినదో. నేనసలు పేపర్లు సరిగా చూచేవాడనై లేకదా. దొరకవు కూడాను.

నితో కలిసి మాట్లాడి తెలుసుకొని ఆనందించవలసిన విషయాలు చాలాఉండుట నిజము. అది ఎప్పటికి సమకూడునో. ఉత్తరాలలో ఏముంటుంది. ఉత్త వ్రాలే అన్నమాట నాకురుచిస్తుందా ? ఆ వ్రాలలోనే యెంతో ఉంటుంది నాకు కలిగే తృప్తీ ఉత్సాహమూ ఆనందమూనూ. కాబట్టి అందులో అశ్రద్ధ చొరకుండుగాక యని నా కోరిక. నీ ఉత్తరాలు జాగ్రత్తగా దాచుకొని చూచుకొని సంతోషిస్తూ ఉంటాను. అంతా క్షేమం. అందరి క్షేమములు తెలుపుతూ అందరినీ అడిగినానని చెప్పవలెను.

చల్లా సూర్యనారాయణ

జాబు నెం. 61 **C.V.V.P.** *Equinox* 23.9.47

సాయంత్రం.

ఉదయము సాయంత్రము మనము చేయుప్రార్థనయే సంధ్యావందనము అనుచుండినాను.

"సర్వకర్తయౌ నీశ్వరేశ్వరుని దివ్య
తేజమువరేణ్యమును వినుతించుచుంటి
మిదికదా లోన నుండి మాకెపుడు మంచి
మంచి తలపులనే ప్రబోధించుననుచు".

వారన్నరీతిగా (శ్రీ రాధాపతిగారు [18]***Truth is god—god is truth*** అని అన్నారు) భగవంతుని ధ్యానించి బాధితులుగా ఉన్న మనం అబాధితమగు ఆ సత్యాన్ని పొందాలి. మనలను చుట్టుకొని ఉండే మాయావరణాన్ని ***Bore*** చేసుకొని ఆ ***truth***ను ***Realise*** చేయడమునకిదేమార్గము. ***Impurities*** అన్నీ మనంలోనికిచూస్తూ పోనుపోను పైకి కొట్టివేస్తూ మనలను ***Purify*** చేసుకుంటూపోతే ***truth***ను ***realise*** చేయగలుగుతాము.

ఏర్వేడు మళయాళ స్వాములనుగూర్చి మనం మొన్ననే మాట్లాడుకొన్నాము. నిన్న ఆయన శిష్యుడొకడు వచ్చి ఆయన నాతో మాట్లాడవలె ననుకొంటున్నాడని చెప్పినాడు.

పింగళలో నుండి యోగము పుట్టినది. ఈ పింగళ మానవ శరీరంలో వర్కు చేయడంలేదు. 'ఇడ' మాత్రమే వర్కు చేస్తున్నది. ఇక నుండి పింగళ వర్కు చేయవలసి ఉంది. సహస్రారము నుండి స్టార్ట్ అయి మూలాధారములోనికి సూత్రమువలె ఇడ ద్వారమున చొచ్చుకొనిపోయి లైఫ్ వర్కు చేస్తున్న దిప్పుడు. పింగళలోకూడా అది వర్కు చేయవలెను. పింగళవరు చేయడమంటే మన వెనుక పార్శ్వమును మనం చూడడమన్నమాట. ఇడతో పింగళ నాడి కలియడమే కష్టంగా ఉంది. ఆ కలియడమునకు అటెమ్టుచేయడంలోనే డెత్ వస్తూంది. దాన్ని దాటలేగాని ఎటర్నటినిపొందడముండదు. వాటి రూపములను బాగా విడమర్చి చెప్పితాను. ఇడ పింగళలు రెండు సైడ్సు. సుషుమ్న మధ్య నున్న రాల్వాను గల్గిన ఉపయవము. వాటి కలయిక జరుగుతుంది. పింగళ అంటే పిన్+కలై – వెన్నునుచూచుట. ఆ చూడడమునకు మనమంతా *one*గా కావాలి.

యోగమునకు చిహ్నమే యజ్ఞోపవీతము. యోగము పింగళలోనే పుట్టిం దనడానికి యజ్ఞోపవీతము గుర్తు. పింగళ శరీరములో ఎడమపార్శ్వముననున్నది. ఆ గుర్తుకుగానే జందెము కూడా ఎడమభుజముపై నుండుట. రెండు నాడులు అంటే ఇడ పింగళలు ఒక దాని కొకటి *X* వలె కావలసి యుంది. అట్లా ఆయితేగాని *full circle*ను చూడలేము. ఒక ఉదాహరణం చూడండి. అట్లా *X* అయ్యేటందుకు తాను అదర్‌తో మీట్ అయినపుడు జందెము *K* వలె అవుతుంది. తాను తన సంపూర్ణ స్వరూపమును చూడగల్గుతాడు. అట్లా చూడడమునకు *Pure love* అవసరము. ఇప్పుడు జరుగుతున్నదే పింగళలో జరుగవలసినది. గంధిగారంటున్నట్టు మన మంతా నిత్యమగు ఆపరతత్వమును (అనగా గంధిగారంటున్నదిది - నిన్నపుట్టి నేడుండి రేపుపోయే మనము నిన్న నేడు రేపు ఎల్లప్పుడూ ఉండే భగవంతుని పట్టుకున్నామా, అన్ని కష్టములను గట్టెక్క గల్గుతామంటున్నాడు) అనిత్యులముగా ఉన్న మన మాశ్రయించితిమా చెట్టును నీడవలె అంటిపెట్టుకొంటిమా మనల నాయన కడతేరుస్తాడు.

సి. వి. వి. తిరుపతి

చిరంజీవ ! సుఖీభవ ! 14 – 11 - 47

ఉభయకుశలోపరి. మీ టెలిగ్రాం, జాబులు చేరినవి.... నేను సందర్భములు సరిచూచుకొని జాబులు వ్రాస్తూ ఉంటాను. వెంటవెంటనే వ్రాయలేదనుకోవద్దు. మీ క్షేమాదికము వ్రాస్తూ ఉండుము. ముందు సి.వి వి. వ్యక్తము కావలెను. "మాస్టరు సి వి.వి. నమస్కారము" అని మాత్రమే మీరు నమస్కరింపవలసినది. *P* వారికి నమస్కరించనతర్వాత, ప్రత్యేకముగా నమస్కరించిన నమస్కరించుటో, ప్రేమలో స్మరించుటో చేయవచ్చును - అని తోచుచున్నది. మీ జాబులలో *M-C.V.V.* నమస్కారము అని వ్రాయుచుండుట మంచిది.

గ్రహించవలెను

వే. ప్ర

చిరంజీవి కొత్త వెంకటేశ్వరరావు

గుంటూరు.

సివివి

22—11—47

సాయంత్రము

కొన్ని విషయములు మాట్లాడుదామంటే నాకీమధ్య ఇప్పుడు కాదనడానికి చిహ్నంగా నోరు కట్టేసినట్లు అవుతూంది. కారణము, ఇక్కడకూర్చొనే వాళ్ళలో అనేకుల కీరైన్ అంటే ఏమిటో తెలియదు. ఇక్కడికేదో ***treatment***కు అని వచ్చేవాండ్లంతా వెంటనే వెళ్ళిపోవడము మంచిది. ఎందుకంటే నేనిక్కడమాట్లాడే విషయాలు కొందరికే అదీ కొందరు కొందరికి మాత్రమే వెనుకటివాసనల వలన ఆ విషయాలు అర్థమవుతూ ఉంటుంది. సరిగా అర్థముగాకుండా అవతల ఒకదాని

కెంకొకవె ఏమి మాట్లాడుతారో అని నేను *treatmnet* మాత్రమునకే వచ్చినవారిని వెళ్ళిపొమ్మనడం.

ఈమధ్య నాకిదనం అడవికి వెళ్ళాలని బుద్ధిపుట్టింది. మనస్సుచాలాచిరాకుగా ఉంది. అడవికి వెళ్ళేటట్లయితే ఎవరెవరు? వెళ్ళడంఅని. ఇంట్లో ఆవిడను గూడా పిల్చుకునిపోవడమా? ఒక్కడనే వెళ్ళడమా? ఇత్యాదిగా అనేక భావము లుత్పన్నమయినవి.

మొదట అడవికి వెళ్ళటమనగానె వెనుకటికథ జ్ఞాపకము వచ్చింది. ఒకప్పుడు భార్యను పంపివేయడం, మరొకప్పుడు తాను వెళ్ళడము జరిగింది. అడవికె వెళ్ళడానికి కుదిరింది. చిన్న *Jeep Car* లో ప్రయాణంచేశాము. వెళ్ళే టప్పుడు నాకు తోడుగా ఉంటాడని సీసా-ను గూడా పిల్చుకొని వెళ్ళాను. నేను, సీసా, పార్థసారథి, దీనదయాళు నాయుడు వెళ్ళివచ్చాము. అడవిలో ఎవరైనా దిక్కుంటారేమో! పిలుస్తేబదులు వస్తుందేమో! అనుకుని ఎలుగెత్తి పిలిచాను. పలికేదిక్కులేదు. అరణ్యవాసమంత రోత వేరేవుండదనిపించింది. వెంటనే ఇంటికి వచ్చేశాము. పార్థసారథికి ఆ రాత్రి ఒక స్వప్నం కనిపించింది. (ఇది తర్వాత)

ఇతడు (పార్థసారథి) నావద్దకు రావడమునకెంతో అర్థం వున్నది. వెనుక రథమునకు సారథిగా వుండేవాడు. ఆ భావాన్నె స్ఫురింపజేస్తూంది ఇప్పటి ఇతని పార్థసారథి నామము. నాయనా! నీ స్వప్నము చెప్పుము.

పార్థసారథి :— ''ఆ దినమునకు (అడవికిపోయిన దినమునకు) తర్వాత దినం రాత్రి నిద్రలో ఒక కారులో మీరు, నేను, యిరువురము మాత్రమే ప్రయాణము చేయుచున్నాము. మీరు *Drive* చేయుచున్నారు. కొంతదూరము పోయిన తర్వాత నొకమలుపు తిరిగినాము. తిరుగగానే ప్రక్కననొక తామరకొలనున్నది. ఈ కారు వెళ్ళి ఆ కొలనుప్రక్కనే బురదలో పడినది. నేను మాత్రము దూరముగా పడినాను. లేచిచూచేప్పటికి మీరు మాత్రం *Steering* ను జాగ్రత్తగా పట్టుకొని క్రిందపడకుండా ఉన్నారు. నేను దగ్గరకు పరిగెత్తుతూవుంటే అక్కరలేదు అని

అన్నారు. ప్రక్కనున్న కొలనులోని పద్మములు చాలా హాయిని గొల్పుతున్నవి'' ఉపయం మీతో చెప్పినాను.

ఈ స్వప్నమునకు ఎంతో అర్థమున్నది:—

వెనుకరోజు రథంలో కూర్చోపెట్టి తానే సారథ్యంచేస్తూ వెళ్ళినాడు. కొంత దూరంపోయిన తరువాత మధ్యను ఇంకోదారివుంది. దాని నిండా జనం క్రిక్కిరిసివున్నారు. ఇక్కడేమిటో జనం వున్నారు చూదామనుకొని తలవని తలంపుగా రథమునావైపు త్రిప్పినాడు. తలవని తలంపుగా త్రిప్పినందున ప్రక్కనేవున్న గొయ్యిలోనికి రథం ఒరిగింది. రథములో ఉన్న మనుష్యులు డా గొయ్యిలో పడేట్లు అయినది. కాని గుర్రపుచతురిమచే ప్రమాదంలేకుండా తప్పి పోయింది. అప్పుడాతనికి 'సర్వం క్షణికంక్షణికం'అని తోచింది. రథంకొంత దూరం పోయింది. దారిలో ననేకులు రోగులు తటస్థమయినారు. వెంటనే 'సర్వం దుఃఖం దుఃఖం'అనుకున్నాడు. రథం మరికొంతదూరం సాగింది. ఒక ప్రక్క వివాహ మంగళవాద్యాలు, మరొక ప్రక్క మరణఘోషలు వినిపించినవి, "సర్వం స్వఫలంస్వఫలం" అనుకున్నాడు. ఆ రాత్రే ఎవరితోనూ చెప్పకుండా అడవికి వెళ్ళినాడు. ఇవన్నీ జ్ఞాపకమునకు వచ్చినవి. అప్పుడు తటస్థులయిన రోగులు వగైరాల బాధలను నివారణము చేయలేక పోయినాడు. అందుకు కారణం తాను సన్యాసిగా వుండటమే. అపుడెవరెవరి బాధలయితే మాన్పలేకపోయినామని దుఃఖపడిపోయినాడో వారందరికీ యిపుడు బాగుచేయడం జరుగుతుంది. ఇందుకు కారణం. ఇపుడు గృహస్థాశ్రమంలోవుండడమే. వెనుక పాము కరచివస్తే తానేమీ చేయలేకపోయినాడు. ఇపుడు *Save* చేయడం జరుగుతూంది. పాముకాటుకు *treat* చేసేటపుడు జాగ్రత్తగా వుండమన్నారు మాష్టరుగారు.

వెనుకటి విశేషాలన్నిటిని గుర్తించడమునకు *All side Conscience* అవసరము. అది మనకు మాష్టరుగారి అనుగ్రహముచేతనే కలుగుతుంది. అపుడు గాని మనము *eternal* గా *stand* గావటానికి వీలులేదు.

అటువంటిస్థితి గలిగేటప్పుడొక విషయము జరుగుతుంది. ఆ స్థితినిపొందే వాళ్లంతా *Master* గానే అవుతారు. అపుడు ఎవరు నిజమైన *Master* గారు?

ఏ దాయనదయచే ఆ స్థితిని పొందినవా డన్న సందేహమును పుదర్ గారికి పోగొట్టి *real Master* ను తెలిసేటట్టుగా చేస్తారాయన. ఏదిఎట్లాగైనా ఈ *December* ఆఖరుకు ఈ *line* యొక్క *Work* తీవ్రగతిని సాగుతున్నట్టుగా బాగా తెలియ వలసి ఉన్నది. ఇపుడు జరుగుచున్న విశేషాలను బట్టి చూస్తే వచ్చే *December* 1948లోగా దీని సంగతి తేలితీరాలి అని అనుకుంటున్నాను.

సివివి

తిరుపతి

శ్రీ బావగారికి నమస్కారములు. 23—2—48

ఉభయకుశలోపరి. మీ కార్డు చేరినది. జీవితమురాతిబండై చావురాక ఏడిపించడానికి ఉన్నదున్నట్టుండడంచేత—ప్రజ్ఞ చెడిఉండడంచేత ఇంతదాక ఏమీ వ్రాయలేక పోయినాను. 8వ తేదీ రేడియోకాని, 12వ తేదీ ఆంధ్రపత్రికకాని, మీరు వినడమో చదవడమో జరిగివుంటుందనుకొంటున్నాను. ప్రళయంబెల్లను తన గుండెల మీదికి తెచ్చుకొని తృటిన్ కలియుగమున్ దొలగించెనేమొ యిఁకపైఁ దెలియవలెన్ గాంధిదేవు తీరేమంచున్![19] నా ప్రాణములు గండుచీమలవలె బలే పట్టు పట్టి ఉన్నవి. ఈ సర్వజిత్తు ఎంత ఎత్తు ఎత్తినది! ఏమి వ్రాయగలను? నవయుగముతోనైనా సరే. ఎప్పటాటే ఆడవలసిఉంటే మనబోంట్ల, వృద్ధుల, జీవిత వృద్ధి శుద్ధిలేనిదవుతుం దనుకొంటున్నాను. బుద్ధిలేక ఏదో వ్రాసినాను. క్షమించండి. ఎప్పుడన్నా రా గోరితే రండేం.

చిత్తగించవలెను

*To* వే. ప్ర.

చల్లా సూర్యనారాయణగారు,
బిక్కవోలు, తూర్పుగోదావరి జిల్లా

తిరుపతి
4-3-48

బావగారికి నమస్కారములు.

ఉభయకుశలోపరి కడచిన జాబులో నేను వ్రాసిన భావం, రాగోరినపుడు 'రండి' అన్నది. నేను రాగోరినప్పుడు అన్న తలపుతో- మీకు రావలెనని ఉంటే అని కాదు. ఎప్పుడో ఒకనాడు- మిమ్ము రమ్మని నేను వ్రాయగల యోగ్యత, మీరాక అవశ్యకత, కలుగగలదని నమ్మకము. ఈ కార్డు ఎడ్రస్ వ్రాసి నెల అయింది. జాబు ఈనాడు వ్రాస్తున్నాను. మనిషిని వున్నానేకాని మనసు ఎక్కడో వున్నది. గంధిగారి మరణం తర్వాత నాకు లోకం కీకారణ్యంగా వున్నది. పచ్చని అరణ్యంగాదు. మాడి పోయిన కీకారణ్యం. ముట్టుగుడ్డల మూటను చాకలి ఈడ్చుకు వెళ్ళుతూ ఉండేటట్టు జీవితం ఈడ్చుకుపోతున్నాను. గంధిగారి జన్మ వల్ల భారతదేశం స్వర్గతుల్యత పొందితే, తన్మరణం వల్ల నరకతుల్యతపొందింది. అట్లే అంతరంగం మహోన్నతంగా ఉంటే, బాహ్యం నాకు పాతాళంగా ఉంది. ఏమీ తీరిక లేదు. సదా *C. V. V.* మయతతో- ఏదోగడుస్తోంది. ఈ నెల 13 తేదీ నుండి వెకేషన్ ఆరంభం. ఆంధ్రదేశం అంతా ఒకతూరి చుట్టి రావలెనని ఆశ. ఏం చేస్తానో! మీ అందరిక్షేమములు తెలుపగోరినాను. నాకు ఈ సర్వజిత్తు ముగియడంతో 60 ఏండ్లు నిండడం. మీ వయస్సు? సంవత్సరాదినాడు ఉదయం 7½ కుగాబోలు రేడియోలో ఏదో సాహిత్యచర్చ. అందులో నేనూ ఉంటాను. వీలుంటే వినండి. అన్నవరం రైలుస్టేషన్ మీ స్టేషన్‌కు దగ్గరా?

చిత్తగించవలెను.
వే. ప్ర.

*To,*

చల్లా సూర్యనారాయణరావుగారు.

*　　*

తిరుపతి.
24-10-48

చిరంజీవ! సుఖీభవ.

ఉభయకుశలోపరి. చి॥ సచ్చిదానందముకు నీవు వ్రాసిన జాబు చూచి

కంగారుపడినాను. చి॥ రామకోటయ్య ఆరోగ్యము ఎట్లున్నదో దాన్నిబట్టి నీవు మనసుకుదిరి అట్లు వ్రాసితివేమో అని. అందాక ఆతని ఆరోగ్యము గూర్చి తృప్తితో ఉన్నవాడను చకితుడనై ఆతనికి జాబు వ్రాసితిని. మర్నాడే ఆతడు సుఖముగా ఉన్నట్లు ఇక్కడ సరిగా జరిగిన ట్రీట్‌మెంట్ సందర్భమంతా తెలుపుతూ జాబు వ్రాసినాడు. దిగులుతీరినది. నీవు పశ్చాత్తాప తీవ్రతతో వ్రాసిన జాబని అది నీకు క్షేమమే కూర్చునని, తర్వాత తృప్తి చెందినాను. ఇక్కడ డైరెక్టరు[20] గారి భార్య గారి ఆరోగ్యము చాలా తృప్తికరముగ దినదినవృద్ధితో ఉన్నది. దీనిని చి॥ రామకోటయ్య అబ్జర్వ్ సరిగా చేస్తున్నాడు, చి॥ సెట్టి (తెప్రసి) ఆరోగ్యము అంత తృప్తికరముగా లేదు. ఎట్లుండునో! మందు గూడ ఇచ్చుట జరుగుచున్నది. అందరము క్షేమము. కొన్నాళ్ళనుండి తీవ్రముగా కొన్ని కొన్ని సందర్భములు గోచరించుచున్నవి. అందొకటి. చి॥ సౌ॥ సుజాత వివాహ సందర్భమున— గురుపూజ—జరపవలెననీ *C. V. V.* అనుగ్రహము పొందినవారి నెల్ల రావింపవలెనని, ఆసందర్భమున చాలా గొప్పగా ఒక సంపుటము—గురుపూజ అని వెల్లడింపవలెనని తోస్తుంది. అందుకే వ్యవధికలిగిందని. దేశము ప్రశాంతముగా ఉండగా శాంతి సమృద్ధమమృతమ్ అని ఈ సందర్భము సంఘటిల్ల గలదని తోస్తుంది. కడచిన మాఘమాసమున జరుగవలసినది, ఈ మాఘమున జరుగగల దనుకొందును. అది నాకు అరవై నిండి అరవై ఒకటి దాటకమునుపు అగును. ఆవాల్యూంలో *C. V. V.* చరిత్ర, వారి యోగ విశేషములు, వారి శిష్యుల విషయములు, శిష్యులమూలమున ప్రశిష్యులమూలమున వారు వెలయించు మహామహిమలు, వగైరాలు అన్నీ సర్వ సమృద్ధముగా శక్యమైనంతవరకు సేకరించి వ్రాసి ప్రకటించవలెనని తోస్తుంది. ఇదంతా జరిగేటట్టయితే నీబోంటు, కాళ్ళుచేతులు చల్లనార్చుకొని నిరుత్సాహంతో కూర్చుంటే సాగుతుందా? ఏమి జరగవలసి ఉందో మీ అభిప్రాయం తెలుపండి. చి॥ రామకోటయ్య ప్రకటింపించిన సంచిక కాదు ప్రకటించవలసినది. అది వేరే ఉన్నది అని అప్పుడు తోచింది. అతడు నిడుప్రోలు సంచిక తెచ్చినపుడు.

గ్రా॥

*To,* వే. ప్ర.

కె. వెంకటేశ్వరరావు.

తిరుపతి

10—11—48.

చిరంజీవి! ఉభయకుశ లోపరి.

నీ జాబు చేరినది. అల్పకారణములతో అల్లకల్లోలపడవద్దు. మహత్తర విప్లవములతో ఆపదలతో క్షోభిస్తున్నవారి స్థితులలోనికి దిగుదుముగాక. వాని సహానుభూతి మనకు ఉచ్ఛ్వాసము కలిగించగలదు. తక్కిన సందర్భములన్నీ సమక్షమున తెలుపతగినవి. పూర్వోత్తర సందర్భములతో అనన్వితముగ వుండని తీరులోనే నా కార్యరీతి ఉండి తీరవలెను. తప్పిపోతున్నాననుకోవద్దు.

మీయందరి క్షేమము తెలుపగోరినాను. నేను మీకు ట్రీట్ చేయడం కాదు, మీకు మీరే చక్కదిద్దుకోవలెను. ఇతరులను దిద్దవలెను. ట్రీట్మెంట్లు నిర్వాహము చెకదకపోతే అది మూల తత్వము తప్పిదముకాదు. మనమందరము అదే అనుకునే టప్పుడు తప్పిదము దానిదే అనవచ్చును. ఆస్థితిలో మన ఉనికి కలిగితే కొఱతే ఉండదేమో! నేను "ప్రభాకరము" అని పుస్తకము వ్రాయుట నిరాక్షేపముగా సాగ తగిన కార్యమనే తలచుచున్నాను. సవిస్తరముగా విన్న తరువాత మీరూ వేఱు విధముగా భావించబోరు. శ్రీడైరెక్టరుగారి భార్యగారి జబ్బు అంతా తగ్గినది. 8, 9 అంగుళాల పొట్టకొలత తగ్గినది. నార్మల్ స్థితికి వచ్చినది. ఇక తగ్గవలసినది లేదు. ఇది చక్కబడినది కాని, కోమటి (శ్రెపసి) చనిపోయినాడు

*To*

*k. VenkateswarRao* — గ్రు॥

*4th Coss Road*

*Bradiepet, Guntur.* — వే॥ ప్ర॥

*

జాబు నెం. 62.

తిరుపతి

24—2—49

ఆర్యా వందనములు

ఇచ్చట మేమందరము క్షేమము. అచ్చట మీక్షేమ సమాచారము తెలుప ప్రార్థన ఈ క్రింది ఉత్తరం శ్రీ శాస్త్రిగారు శ్రీ సత్యనారాయణశ్రేష్ఠిగారికి వ్రాసి

నది. ఆ ఉత్తరం కాపీ ఇది. శ్రీ శాస్త్రిగారు చికాకుగా వుండి మీకు ఆ కాపీ తీసి పంపమన్నారు. చికాకుకు కారణం ఉత్తరం చదివితే తెలియగలదు.

—శ్రీనివాసాచార్యులు.

చిరంజీవ!

ఉభయ కుశలోపరి

పెద్ద విప్లవము. శ్రీ తాతిగారి[21] భార్యగారి మరణమును గూర్చి తలచు కొంటూ కంపించిపోతూ, తాతిగారికి జాబు వ్రాయడానికే చేయాడక, మనసు కుదుటపడక క్షోభిస్తూవున్న నాకు యన్. ఆర్. బి. వి. గారి మృతి వార్త [పేపరులో నిన్న సాయంకాలము] చూచినాను. ఎట్టి స్థితి కలిగిస్తుందో వ్రాయ నక్కరలేదు. కాని అది చదివిన గంటన్నరకే జరిగిన ప్రాక్టీసు 6.30 కి చాలా శక్తిమంతుడనయితిని. నిబ్బరము చెందినాను. ఆనాటి సి వి వి. మృతి వార్త కంటే ఇవి ఎక్కువ కావుగదా! యన్.ఆర్.బి.వి. మృతి సందర్భము ఎట్టిదో, రామానుజముగారికి, ఆయన అనారోగ్య వృత్తాంతము ముందు తెలుసునేమో! ఉత్తరము మొదలయిన విధముల ఆదుస్సంఘటన తీరు తెలియవచ్చునేమో! మదరాసులో ఎవరి ద్వారానైనా తెలియవస్తే, లేక రామానుజముగారు ఊళ్లో ఉంటే, ఈ ఉత్తరము తెలిపి విచారించి సవిస్తరముగ వ్రాయగోరినాను. ప్రపంచ మంతా తల్లక్రిందులైనా సరే ప్రాక్టీసులో ఆక్షన్ జరుగుతూ దానివల్ల ఇతరులకు ఉపకారము జరుగుతూ నాకు సచ్చిదానందములు లభిస్తూ ఉండడమును బట్టి నా ముక్కులో ఊపిరి ఆడుతూ ఉండేదాక నేను ఈ మార్గమును విడుచువాడను కాను. ఈ విషయము మార్గశిరశుద్ధమునకు నేను మదరాసు వచ్చినప్పుడు మీ మేడ మీద, రామానుజమున్ను, యన్ ఆర్.బి.వి. కుమారుడు వచ్చి ఉండగా స్పష్టముగా వెల్లడించినాను. ఒకవేళ యన్. ఆర్. బి. వి శరీరము విడిచినా నే నిశ్చయమునకు, కారణము నాలోని సి. వి. వి. ఆక్షన్‌గానే, ఉంచుకున్నాను గనక చలింపను అని స్పష్టముగా చెప్పితిని. ఆ నిశ్చయముననే నేను నిలిచి తీరుదునుగాక! ఇట్టి ధైర్యము సి.వి.వి. నాకు అనుగ్రహించినారు. వారి మీద

ప్రేమసౌక సహాయమున ఆపత్సముద్రమును గడపగలనుగాక. ఈ మహాపిప్లవములో ఇక్కడి కార్యకలాపములలో—నేనుమదరాసు రావలయునని ఎంత ప్రయత్నించినా కాళ్ళాడడంలేదు. ఈ ఉత్తరం ప్రకారం విషయములు విచారించి, జాబు వ్రాయుటతోపాటు నీవు వెంటనే ఒకతూరి ఇక్కడికి వచ్చి [ఉత్తరము కంటే నీవువస్తేనే మంచిది] ఒక్కరోజు మాత్రమే వుండి సవిస్తరముగా నేను చెప్పే విషయములు, ఇక్కడి సందర్భములు తెలుసుకొని వెళ్ళగోరినాను. అట్లు నీవు వస్తే తాతిగారు, వెంకటసుబ్బాశాస్త్రి గారు మొదలగు మిత్రులకు నా నిశ్చయములు, వాని వల్ల కొంత నిబ్బరము కలుగవచ్చునేమో ! ఇక్కడ అందరము ఆరోగ్యముగానే వున్నాము. తాతిగారి స్థితి చాలా గజిబిజిగా ఉంటుందనుకొంటాను. ఉండదామరి? నేను వేఱు తాతి వేఱు అనుకోవడంలేదు! ఏమిచేసేది! ప్రపంచమంతా డిజార్డరు''గానే వుంది. ఇకనైనా చక్కబడగలదుగాక అని ఆశిస్తున్నాను. ఒక ప్రక్క నిరుత్సాహహేతువులు ఇంత తీవ్రముగా ఉంటే మరొక ప్రక్క ఎప్పుడూ లేనంత తీవ్రముగా ట్రీట్మెంట్లు, ఆరోగ్యములు, విశేషములు జరుగుతున్నవి. నేను నావశములో లేను.

వే॥ ప్రభాకరశాస్త్రి

[ఈ లేఖ శ్రీనివాసాచార్యులుగారి దస్తూరితో ఉన్నది]

***To***

***K. Venkateswar Rao***

'కామేశ్వరి' ప్లైలర్స్ఎస్టేట్
అక్బరాబాద్—మద్రాసు
9—9—49

***My dear Friend,***

మీరు 7వ తేదీని వ్రాసిన కార్డుచేరినది. శ్రీ వెంకటరమణరావుగారికు మీరు వ్రాసిన జాబు నాకు ఇచ్చినారు. నేను మీరు కోరిన ప్రకారము నాతో శ్రీ మాస్టరు

గారు మాట్లాడిన కొన్ని ముఖ్యాంశములు నాకు జ్ఞాపకమున్నవి తెలుగున వ్రాసి యున్నాను. మీరిక్కడికి వచ్చినపుడు మీకు ఇచ్చెదను. కలిసి మాట్లాడుకుందాము. వేరే నేనేమి నోట్సు వారు చెప్పినప్పుడు వ్రాసుకుని యుండలేదు. నా వద్దగ్గిర వారి డయరీలు, కోర్సులపేర్లు వగైరాలు ఉన్నవి గాని వాటిని తిరిగి చదువ వద్దని వారి ఆజ్ఞ దాని బట్టి ఎవరికి నేను చూపవీలులేదు. ఎందుకు నాచేతికి ఇవి వచ్చినవో నాకు తెలియదు. జాగ్రత్తగా దాచి యుంచినాను [28] మీరిక్కడికి ఎప్పుడువచ్చెదరు? నాకు యింట వంట ఏమియు శాంతిలేదు ఏమి చేయుటకు మనస్కరించలేదు. శరీరములో దార్ఢ్యముకూడాలేదు! బుద్ధిచాంచల్యము, జ్ఞప్తి తక్కువయున్నా కూడా!

చిత్తగింపుడు. వో॥ నరసింహం.

*To*

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు,
తిరుపతి.

కార్డునెం. 81 సి.వి.వి. తిరుపతి
19-10-49

చిరంజీవ! సుఖీభవ!

ఉభయకుశలోపరి, ఈనడుమ చి॥ రామకోటయ్యయేగాక పలువురు ఏదో చికాకు లోలో చెందుతున్నట్టు వ్రాసిరి. ఈక్వనాక్సు, వెల్లువలు వగైరాలు, నన్ను చాలా చికాకు పెట్టినవి. బెజవాడలో నిన్నూ అట్లే గుర్తించితిని. నీవు చాలా తీవ్రముగా, నిరుత్సాహంగా ఉన్నట్లుతోచింది. ఈ అన్నింటి సమష్టి నన్ను లోలోనికి గుంజివేయసాగినది. ఏదేదో జరిగింది. దానిలో వ్రాసిన జాబు అది. అందు నీఒక్కడవే కాదు, అందఱము, అట్లే ఆంధ్రదేశము ఇంకా పైపై కూడా భాగస్వాములే. ఈ చికాకులలో తెలిపి కలిగించుకోవడమే తెలివిగా ఉండడము అవుతుంది. మన మనోవైక్లబ్య, శాంతి ప్రభృతులే మన బాహ్యవైక్లబ్య, శాంతి ప్రభృతులుగా అవుతవిఅనీ (చాలా వ్రాయవలసి ఉన్నది) తోచి జాబులో ఇంచు

కంత వ్రాసినాను. కడకు మనలను, మనము (నన్ను నేను నిన్ను నీవుకాక) జీవ పరమాత్మలు — ఇత్యాది — ద్వంద్వములు పరస్పరము వైవిధ్యమున ఏకతను సాధించుకొంటూ వినోదము పొందుటగును. చరమానందములో ఐక్యమగును. ఈ జాబు వ్రాస్తూ(దీనిని చూచి నీవు)పక్కుమని నవ్వి, నవ్వించి, పరస్పరము తృప్తి, శాంతి పడసి జాబువ్రాయగలవని కోరుచున్నాను. నన్ను మీరు మిమ్ము నేను, నన్ను సి.వి.వి, దాన్ని నేను, సి.వి.వి, ప్రకృతిని, ప్రకృతి సి.వి.వి. ని విడనాడతరము గాదు. అంతా క్షేమము. బయట అశాంతి ఉంటే దానిలో చిక్కుకోక (కూర్మంగా నీవ) లోలోనికిపోయి ఏకీభవించి ఆనందము తెచ్చుకోవలెను. ఈ ఈశ్వరానుస్[24] దానినే నేర్పుతున్నది. అందర క్షేమాదికము వ్రాయగోరుదును.

ఇ.
వే. ప్ర.

కార్డునెం. 83 సి.వి.వి. తిరుపతి

11—12—49

చిరంజీవ,

ఉభయకుశలోపరి. నీ జాబు వచ్చినది. సంతోషము. మీరందరూ సుఖముందురు గాక ! పనులవత్తిడి తీవ్రముగా ఉన్నది. మద్రాసు, తంజావూరి పుస్తకాల ముద్రణ, ఆఫీసులో పని, కుమార సంభవ వ్యాఖ్యాన రచన, ప్రభాకర రచన ఇవన్నీ వడివడిగా సాగిస్తున్నాను. అందరం కుశలం. చి॥ మీ ప్రేయసి, బిడ్డలు, మీ అక్క, బావగార్ల కుటుంబము అందరు ఈశ్వరార్పితచిత్తులయి వర్ధిల్లుదురు గాక !, చి॥ గోపాలకృష్ణయ్యగారిని,రవిని, గజపతిని,[25] ఆశీర్వదించితి ననుడు. శ్రీ ఉ. లక్ష్మినారాయణగారు సుఖముగా ఉన్నరుగదా !

జాబు. ఇ॥ వే. ప్ర.

*To*

***K. Venkateswar Rao.***

సీ వి.వి.

చినకాకాని
20-12-49

బ్రహ్మశ్రీ గురుదేవుల చరణ సన్నిధికి

భక్తితో ప్రణమిల్లి విన్నవించునది. తమ దయవల్ల సందరం కుశలము. తిరుపతిలో ప్రేయరు విశేషములు తెలుపవేడుచున్నాను. తమరు గుంటూరెపుడు వచ్చేది తెలియజేయప్రార్థన కొన్నిరోజులక్రితం నాకు మోకాలు నెప్పివచ్చెను. కాలువంగక బాధపడితిని. ఆ విషయం తమకు వ్రాసితిని. వ్రాసిన రోజుననే మోకాలు నెప్పికితోడు వంట్లోజ్వరం తగిలినట్లుగా ఫీలింగు తెలిసినది. అందుచల్ల ఎటు కదలజాలక యింటివద్దవుంటిని. తమకు కార్డువ్రాసిన మరుదినం సాయం కాలం (అప్పటికి నాకార్డు తమకంది వుంటుంది) ప్రేయరులో వింత యాక్షన్ జరిగెను. నమస్కారం చేసికొన్న కొంతసేపటికి విపరీతంగా నవ్వువచ్చినది. ఆపుకొందమన్న ఆగనినవ్వు. శరీరమంతా చమటలు పోసినవి. ప్రతి అణువులో యాక్షన్ జరిగినది. అపుడు 'నా కాలునొప్పి తగ్గవలయును' అనుకొంటుండగా యెవరో 'ఛా' కాలునేప్పిలేదు గీలునెప్పిలేదు. షటప్పు, ఏమి జరుగుతుందో అబ్జర్వు చేయడమే నీపంతు. నీలో ఏమి జరగనవసరమైనపు డది జరుగుతుంది అన్నట్లుగా తోచింది. అలా కొంతసేపుంటిని. తరువాత లేచి చూడగా జ్వరం ఖారం పోయింది. మోకాలు మామూలుగా వంగుతూ వుంది. నొప్పి దాదాపుగా పోయింది. శ్రీమతి అమ్మగారికి నావందనములు.

*To*
*V. Prabhakarasastry garu,*
*Tirupathi.*

విధేయుడు
రామకోటయ్య

## సూచికలు

1. మాస్టర్‌గారి సతీమణి మదర్ వెంకమ్మగారు.

2. శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు. యోగమిత్రులు-

3. సర్వశ్రీ గురు ప్రసాదము (శ్రీ ప్రభాకరుల రెండవ కుమారుడు), బి.పి భాష్యకారాచార్యులు (యోగమిత్రులు), సింగరాజు సచ్చిదానందం (శ్రీ ప్రభాకరుల శిష్యులు)

   ఆ నాళ్ళలో వీరు గురుదేవుల ప్రార్థనానంతర ప్రసంగములను డైరీలుగా వ్రాయుచుండెడివారు.

4. యోగమిత్రులు శ్రీ కొత్తరామకోటయ్యగారు శ్రీ ప్రభాకరుల శిష్యులు. యోగ మార్గ ప్రచారకులు. 'మా శాస్త్రిగారు' గ్రంథకర్త.

5. గురుదేవుల ఆదేశము చొప్పున ఈ లేఖాంశములకు నకళ్లు తీసిపంపిన వీరు శ్రీవారి ప్రముఖ శిష్యులు.

6. శ్రీ ప్రభాకరుల పెద్ద కుమారుడు శ్రీ సుందరమూర్తి. పెద్ద అల్లుడు డా॥ రామచంద్రరావు.

7. విస్సా వెంకట సుబ్రహ్మణ్యము ఆచార్య విస్సా అప్పారావుగారి మూడవ కుమారుడు. శ్రీ ప్రభాకరుల ట్రీట్మెంట్ మూలమున ఆరోగ్యమును, పునర్జీవన భాగ్యమును బడసి సుఖమున్న వ్యక్తి.

8. యోగమిత్రులు, శ్రీ ప్రభాకరుల వియ్యంకులు ఫిజిక్స్ ప్రొఫెసరు.

9. యోగమిత్రులు దేవులపల్లి అప్పల నరసింహంగారు. కుంభకోణం కళాశాలలో ఆంగ్లాచార్యులు.

10. శ్రీ ఎన్.ఆర్.బి వెంకటాచలపతిగారు మాస్టర్‌గారి శిష్యులలో ప్రముఖులు. గురుదేవుల కాప్తులైన మిత్రులు. యోగసాధకులు, నాడీ శోధకులు.

11. మాస్టర్‌గారి శిష్యులు, యోగమిత్రులు, శ్రీ ప్రణతార్తి హర అయ్యంగారు, శ్రీ ప్రభాకరుల కాప్తమిత్రులు.

12. యోగమిత్రులు శ్రీ టి.ఎన్. రామానుజముగారు జగద్విఖ్యాతి గాంచిన విద్యావేత్త. బహుగ్రంథకర్త. యోగప్రచారకులు.

13. శ్రీ ప్రభాకరుల మిత్రులు – తిరుపతిలో ప్రముఖ వైద్యులు.

14. యోగమిత్రులు.

15. శ్రీ ప్రభాకరుల సతీమణి – మహాలక్ష్మమ్మ గారు. మీడియము.

16. గురుదేవుల మూడవకుమారుడు. నేటి మణిమంజరి సంపాదకుడు.

17. స్వాతంత్ర్యోత్సవ సందర్భమున శ్రీ ప్రభాకరులు వ్రాసిన గేయము. చూ. మణిమంజరి 1–2 పు. 96.

18. యోగమిత్రులు శ్రీ పరిమాత్మని రాఘపతి గారు తిరుపతిలో ప్రముఖ న్యాయవాది. గాంధేయవాది. శ్రీ ప్రభాకరులకు అత్యంతాప్తులైన మిత్రులు.

19. చల్లావారికి వ్రాసిన ఇట్టి జాబుల్లో శాస్త్రిగా రిట్టిపద్యా లల్లడంకష్టం.

20. శ్రీ పరవస్తురామానుజస్వామిగారు.

21. ప్రణతార్తి హర అయ్యంగార్. వీరికే "తాత" అని యోగమిత్ర మండలిలో వ్యవహారము.

22. శ్రీ వావిలికొలను వెంకట రమణరావు గారు మీడియము. శ్రీ ప్రభాకరుల కత్యంతాప్తులయిన యోగమిత్రులు.

23. షట్ట సేకరమునుండే యోగమిత్రులు శ్రీ ఎ.వి. శ్రీనివాసాచార్యులుగారు తిరుపతిలో శ్రీ ప్రభాకర మిత్ర మండలి పక్షమున ఇటీవల కొన్ని నోట్సు సంపుటములను ప్రకటించుచున్నారు.

24. ఈ యోగమార్గమున ఈక్వినాక్సు దినములు ప్రార్థనానుభూతులకు ముఖ్యము లైనవి.

25. వీరందరును శాస్త్రిగారికి ఆప్తులైన సాహితీ యోగమిత్రులు.

# ప్రభాకర ప్రవచనములు

— నేటి రాత్రి శరీరమున ఏవో వింత ప్రాక్టీసులు జరిగినవి. ముఖమందు గొప్ప వెల్తురు గోచరించినది. 'చూచితివిరా జ్యోతి స్వరూపమును? ఇప్పటికింతవఱకే చూడగలవు.' అని ఎవరోఅన్నమాట విన పడినది. తరువాత కనులు తెఱపి అయ్యెను. ఇది స్వప్నము వంటి స్థితి లోనే—

(డైరీ 23—4—1926 శుక్ర)

— ఈనాటి నుండి సి.వి.వి లోకమున వ్యక్తమగుట కారంభమని తెలుప బడినది. (డైరీ 2—5-1926 ఆది).

— యోగమార్గము ప్రకారము ఇండిపెండెన్సునకు వేరు అర్థమున్నది. అది యింకా మనకు లభింపలేదు.

— "ఒరే— మీరేదో అనుకుంటున్నారు. తాను చేర్చిన డిసైపిల్సులో నూటకి పదో వంతైనా పర్ఫెక్షన్ వేళకు నిలుస్తారా? నిలువవలెగదా అంటు న్నారురా. ఇంకెంత కాలం గడప వలెనో — ఎన్ని మార్పులు జరుగ వలెనో'' మాస్టర్‌గారి శిష్యులు శ్రీ సచ్చిదానందస్వాములవారు చెప్పిన విషయము — శ్రీ ప్రభాకరుల ప్రసంగము. (6-8—1947)

'నేను ఇనిసియేషన్ చేసిన శిష్యులలో ఒక్కడైనా కడతేరితే లోకమంతా కడతేరినట్లే. అలాగు ఒకడైనా కడతేరే దెప్పుడా అని చూస్తున్నాను. నేనిక ఈయోగ సిద్ధినంతనూ మీ ద్వారానే లోకానికి వెల్లడింపవలసి యున్నాను గాని నేనుగా చేసేదేమీ ఉండదు. నేచేసేదంతా మీ ద్వారానే' — 1921లో మాస్టరు చెప్పిన విషయం- (శ్రీ ప్రభాకరుల ప్రసంగం - 6-8-1947)

మదర్ పుట్టిన స్థలం మదరాసు. పెళ్లి జరిగిన దిష్వారా (తిరుపతి). కాపు రము చేసినది కుంభకోణములో .... నన్ను నేకులు బాపట్ల రమ్మన్నా, రేపల్లెరమ్మన్నా నే నెక్కడికి పోకుండా కుంభకోణమునకే పోతేపోవలెను, లేదా నేనున్న చోటనే ఉండి ఏదైనా పొందవలెననే నమ్మకముతో నున్న వాడిని.

(శ్రీ ప్రభాకరుల ప్రసంగము. 6—8—47)

ఏ ఒక్కడు స్టాండ్ అయినా వాడొక్కడే ఆ పదమున ఊగులాడే వాడుగా ఉండడు. లోకమునంతనూ స్టాండ్ చేయించగల శక్తిగలవాడుగా ఉంటాడు. ఇండిపెండెన్సును మన స్వాతంత్ర్యేచ్ఛ అనే ప్రెషరున కాగలేక (బ్రిటిషు వారు) ఇస్తున్నారు. అట్లే ఈశ్వరుడు కూడా మన వత్తిడికి ఆగలేక మన కిన్ని శక్తులూ కలిగేటట్లు చేస్తాడు.

(శ్రీ ప్రభాకరుల ప్రసంగం 6—8—47)

— ఈ యోగంలో చేరిన తర్వాత 10 ఏండ్లకుగాని ఈ వ్యక్తే (మాస్టర్ సి.వి.వి) ఆరిజన్ అనే నిర్ణయం నాకు కలుగ దయ్యేను.... అప్పటి నుంచే నాలో ఉద్బోధమనే ఊట ఊరసాగినది. ఏదైనా ప్రశ్నకు సమా ధానము రావడము మొదలు పెట్టినది. ఎక్కడ నుండి సమాధానమూ ఉద్బోధమూ ఉత్పత్తి యగుచున్నదో అక్కడికి వెళ్లి చూడకపోయినా

అక్కడినుండి సమాధానము రావడమును గుర్తించ గల్గినాను.... అప్పుడు నాలో మూడు శక్తులున్నవని గుర్తించగల్గినాను. బుద్ధిలో నుండి సమాధానము వస్తూన్నదనీ, మనసు సందేహపడుతున్నదనీ, నా జీవాత్మ వాటి నన్నిటిని రెసీవ్ చేసుకో గల్గుతున్నదని తెలుసుకోగల్గినాను.

(శ్రీ ప్రభాకరుల ప్రసంగము 7-4-47)

* *

ఎక్కడైనా పరతత్త్వము పొందవలెనని నిరంతరము కొట్టుకొంటున్న వారెవరైనా వుంటే వారికే ఆ వస్తువు కనిపించవచ్చు. అట్లా కనిపించే వ్యక్తి శ్రీ మాస్టరుగారని నా నమ్మకము. ఒకనాడు వారు 'మీరు నన్ను పోలి ఉండేట్లు యత్నించండి' అన్నారు. అప్పుడు నాకిట్లా తోచింది. వీరికి వీక్నెసులున్నవి కదా! ఈయన ఇట్లా అంటున్నారేమిటా అని! మరొక సందర్భంలో నన్ను గూర్చి యిట్లా అన్నారు. "నన్ను డైరెక్టుగా తెలుసుకొనేటంత వఱకూ నన్ను గూర్చి ప్రాపగండా చేయవద్దు." అని. కాబట్టి వారిని గూర్చి నేనిప్పుడు (1947) మాట్లాడడం విరుద్ధంగా ఉంది కదా!- దీనికి సమాధానం ఇప్పుడే లోపలి నుండి "నన్ను తెలుసుకొంటేనే గాని'' అన్న భావానికి ఆ తర్వాత 10 ఏండ్లకు వారే బ్రహ్మమని గుర్తించాను. గదా! ఇప్పుడెందుకు విరుద్ధమవుతుంది? ఎంతెంత వారిని తెలుసుకొంటున్నానో అంతంతే వారి గూర్చి మాట్లాడుతున్నాను. వారే బ్రహ్మమనే నా నిశ్చయం ఎవరికీ చలింపజేయరానిది. ఇక భయమేమి?

(శ్రీ ప్రభాకరుల ప్రసంగము. 7-4-47)

— ఈ ఆక్టివిటీని కలిగించే శక్తి, ఆ మూడక్షరాల (సి.వి.వి) స్మరణమే. ఆ పేరును తలచుకొనేటప్పటికే ఆ శక్తి ఆ తలచుకొనే వారి డిఫెక్టును తొలగిస్తూ రెక్టిఫై చేస్తూ ఉన్నది. అంతే కాకుండా వారి ద్వారా ఎదుటి వారిని కూడా రెక్టిఫై చేస్తుంది. ఆ కెపాసిటీ అనేది వర్కు చేయకపోతే మీరే కాదు నేనుకూడా పై నిశ్చయంలో ఉండటం తటస్థించదు. ఇంతటి

దివ్యతంత్రమునకూ 'కీ' తాళపు చెవి సీ.వి.వి అక్షరత్రియము. ఇది అదే కాకపోతే ఇంతపని చేయజాలదు.

(శ్రీ పరిభాకరుల ప్రసంగము. 7.4.47)

*   *

— ఈ యోగంలో చేరిన వారికి మాస్టరుగారు ఫస్టు ప్రేయరుగా ఒసగినది స్వాతంత్ర్యమును గూర్చే. ఈ యోగంలో చేరిన వారిని గూర్చి మొదట వారు చెప్పినది — స్వాతంత్ర్యాన్ని గూర్చిన వాక్యం మీకు వినిపిస్తు న్నాను. *First six months* ఈ ధ్యానమే చేయండి అన్నారు. ఆధ్యాన మిది. "***Please make me fit to find brahmam and liberate me to realise independency in this life.***"

వారి పేరు చెప్పేటప్పటికే స్టార్ట్ అవుతుంది ఏషన్. ఇంగ్లీషు తెలియని వారికని దానికి తెలుగుగా తర్జుమా చేసి ఇచ్చేవారు. ఎమ్. సి.వి.వి అన్న పేరును స్మరణ చేసేటప్పటికి అది కుండలినిలో నున్న లైఫ్‌కు సెంటర్ పాయింట్‌ను తాకి శరీరమంతా వైబ్రేట్ చేస్తూ ఏషన్ జరుపుతుంది. లైఫ్‌కి సెంటర్ పాయింటు మాస్టరు ఫస్టు ఆ లెవల్‌ను బోర్ చేసుకొంటూ చూస్తూపోతే శూన్యంగా ఉండేగాని వేరేమీలేదు. అది ట్రిక్కు సర్కిలు. అక్కడకు వెళ్లి చూస్తే తన్ను తానే చూడడమయింది. ....ఈ జీవిత కాలంలోనే బ్రహ్మమును చూపిస్తాననే వస్తువేమై ఉంటుంది? బ్రహ్మమును చూపిస్తానంటే అది అదే అయితే కాని చూపించడానికి వేరెవ్వరికీ అధికారము లేదు. (శ్రీ పరిభాకరుల ప్రసంగము 18.9.1947)

— అంతా డిసార్డర్‌గా ఉంది సెంటరయిన ఢిల్లీలోనే డిసార్డరుగా ఉంటే ఇంకేముంది.... మనకు శాంతిని చేకూర్చ గల్గితే ఆయనే చేకూర్చ వలెను. ఆయన ఆ పనిని చేస్తారనే నమ్ముతున్నాను. అంతే కాకుండా వేరు విధంగా జరిగితే ఆయన (గంధి) తర్వాత ఒక క్షణం గూడా ఉండా లని లేదు నాకు.

(చూ. మణిమంజరి.—వెనుకటి సంచికల నుండి ఉద్ధరించిన అంశములివి.)

# గురుదేవులు
# శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు -
# యోగము - ప్రబోధము

**- మైనంపాటి వేంకట సుబ్రహ్మణ్యము**

గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు మాస్టరు సి.వి.వి.' గారి యనుగ్రహమునకు పాత్రులై, శిష్యులై వారి యోగ మార్గము నవలంబించి తదనుష్ఠానము నుభయ సంధ్యలందును, జీవితాంతమువఱకు నిష్ఠాగరిష్ఠులై యనుష్ఠించిన యోగి పుంగవులు. మహాత్ములు

తిరుపతిలో వారు నివసించునింట ప్రతినిత్యము వారిపజ్జను ఎందరో యోగ మిత్రులు పెద్దలు పిన్నలు ప్రార్థనమున పాల్గొని యనుభవానందాంబుధి నోలలాడిన వారెందరో కలరు. వారిలో ముఖ్యులు శ్రీ పరమాత్మని రాధాపతయ్య, శ్రీ కొచ్చి వేంకటేశ్వరరావు, శ్రీ శ్రీనివాసులు శెట్టి, శ్రీ వెన్నెల కంటి మునికృష్ణయ్య మున్నగువారు స్థానికులు. పొరుగూళ్ళనుండి వచ్చిపోవు యోగ మిత్రులెందరో! చీఫ్ జస్టిస్ పి.వి. రాజమన్నారు (మద్రాసు) పెద్దలు. విద్యార్థులు సరేసరి – సాహిత్యాభిలాషులై యరుదెంచెడి పండిత మిత్రు లెందరో! అందఱకు చిఱునవ్వున స్వాగతమిచ్చి వారి యభీష్టములెఱిగి సహృదయమున తీర్చు మహాత్ముడు శ్రీ శాస్త్రిగారు. యోగచికిత్సా విధానమునకై యరుదెంచు బంధుమిత్రులను తనయింట నుంచుకొని వారికి యారోగ్యము ప్రసాదించి పంపుటలో తమ గురుదేవులు 'మాస్టరు–సీ.వి.వి.' గారికి తీసిపోరు.

సాహితీ పరిశ్రమ, యోగ పరిశీలన తమ జీవిత ధ్యేయములుగా నెంచుకొని కడవఱకు రెంటిని సమముగా సాధించి ప్రజాసేవకు జీవితము కంకితముగా జేసి కొన్న మహామనీషి, మహర్షి శ్రీ శాస్త్రిగారు.

యోగ, సాహిత్యాదులందే విషయమందైన సత్యశోధనలో పరమార్థ మెఱుగుటయే వారి ప్రధాన లక్ష్యము. అందుకై వారు నిరంతరం శ్రమించేవారు పరితపించేవారు. ప్రపంచంలో నెచ్చటనైనా మానవాళికి ఉపద్రవాదులు కల్గినని తెలిసిన వారెంత తల్లడిల్లి పోవువారో వారి చెంత నున్న యోగ మిత్రుల కెఱుక.

30.9.1947 న సాయంకాల ప్రార్థనలో శ్రీ శాస్త్రిగారు ప్రార్థనను గూర్చి చెప్పిన విషయమిది.

''మానవమాత్రునకు అత్యంత సులభోపాయంబైన దీవిధానము. దీనిచే క్రమంగా నొక యున్నత స్థానము కనుగొన వచ్చును. సత్యజ్ఞాన, ఆనంద స్వరూపములచే ప్రకాశించుచు, రూప నామములు లేక యుండెడి పరమాత్మ స్వరూపముగల భగవంతుని స్మరింపవలెనన్నది సుగమము. మన కర్మాను బంధమున కలిగెడి బాధలు తొలగించుటకొక యుత్తమసాధన మిది. దీనినే 'భృక్త రహిత తారక రాజయోగము' అందురు ఈ ప్రార్థనా సమయములో వారివారి శరీరములందు కలుగు ప్రతి చిన్న చలనమును గమనించవలయును. అట్యేది నీటిలో రాయివైప బుడ బుడ మను శబ్దమున బుడగలురేగి లోని గాలి బయటికి పోవునట్లు మన శరీరమందలి అనారోగ్యాది బాధలు తద్రూపమమున (ఆవలింతలు మున్నగునవి) బయల్వెడలి దేహమునకు తేజశ్శక్తిని గూర్చును. మనమీవ్యాపారమున క్రమముగానొక మహాశక్తిని దేహమును రపోఽధ్యయనాదుల వలన నొప్పింపక యీ యుత్తమ సాధనమున సంపాదించి, యున్నతస్థానమందు కొనవచ్చును.

2-10-1947 నందు ఉదయం ప్రార్థనవేళ– "నేడు స్వాతంత్ర్య సామ్రాజ్యలక్ష్మిని పరదాస్యవిముక్తురాలుగాఁజేసి స్వాతంత్రసమరమున పోరాడిన భారతప్రజల చేతులకందించిన మన స్వాతంత్ర్యప్రదాత, పుణ్యమూర్తి, జన్మించినట్టి సుదినము. ఈనాటితో అమహనీయుని వయసులో 76 వ ఏడు

పొందము నొందినది." అని గాంధీ మహాత్ముని జీవితాదర్శములను, పవిత్ర సందేశములను యోగమిత్రుల కెఱిగించిరి. శ్రీ శాస్త్రిగారు గాంధీగారిని 'గంధి' గారు అని అనేవారు.

21-9-1948 న సాయంసమయమున "రేపు మహత్తరమైన దినము 'ఈశ్వరాజ్ఞ్యదే' కావున ఉదయం 6 గంటలకే ప్రార్థనసమావేశము. అందరు రండి!" అని ఆనాటి ప్రపంచ పరిస్థితులను సమీక్షించి, అంతకుముందుగనే తాము ట్రీట్ చేసి వచ్చిన శ్రీ గోవిందరాజాచారిగారిని (అపుడీయన తిరుపతిలో జబ్బిగానున్నవాడు) గూర్చి ప్రస్తావించి వారి ఆరోగ్య విషయములను చెప్పిరి.

23-9-1948 ఉదయం ప్రార్ధనలో గురుదేవు లిట్లు చెప్పిరి.

"మానవుడు 'నేను' అను అహంకార జనితమైన విషయము ననుకొనుటకు వీలులేదు. ఈ ప్రపంచ మొక మానవమాత్రునిచే నడచుటలేదు. సృష్ట్యాది నుండియు మానవులు పరస్పర సహకారముతో నున్నారు. దానికి 'ప్రేమ' అని అనుట తగినదై యున్నది. ఇందుకు ఒక చిన్నకథ-

ఒక ఎనభై ఏండ్ల వయోవృద్ధుడు సంపూర్ణసంతానవంతుడై యుండెను. ఆతని సంతానమున కొడుకులు కుమార్తెలు, వారు వారు సంతానవంతులై యందరు సుఖశాంతులతో వర్ధిల్లుచున్నారు. ఒకనాడు వారి యింట శుభకార్య మొక్కటి గలుగ అందరున్న ఆ వృద్ధుని కుటుంబము తామరతంపరవలె, దోస పాదువలె నుండెను. ఆ శుభసమయమునకతానొక యున్నతాసనమున గూర్చుండి తన భార్య అందిచ్చు ఆకు మడుపులందుకొని నోసినోట బెట్టుకొని దొర్లించు చుండెను. ఆ వృద్ధుడు తన సంతానమును గాంచి మహానందభరితుడై తాను "ఆహా, వీరందరు నా యంశలోనివారే గదా! నే నింత సృష్టికి కారకుడనైతి గదా!" అని పల్కెను. అతని చెంతనున్న భార్యామణి మగని భుజముపై చేయిపెట్టి "నేనో?" అన్నది. అంత నావృద్ధుడు చప్పున నాలుక కరచుకొని "ఆ, మఱచితిని మన మిరువురము దీనికి కారణము" అనెను.- "ఆ. అంతమఱపు! ఔనులెండి!" అని మగని పరిహాసకములాడినదట ఆ యిల్లాలు! అటులనే పరస్పర సంబంధములేక యేచర్యయు లోకమున జరుగదు.

మఱియు ప్రపంచమున నొక దాని నొకటి 'అబ్జర్వ్' చేసికొని తనంతట తానే ఒక సమస్థితి నొందును.

మనము భూమిని జలము నపేక్షించి త్రవ్వనపుడు పై భాగమున కొద్ది దూరమున ఉప్పు నీరుగనో లేక మనకు కావలసినంత 'సప్లయి' చేయలేనంతటివి గనో, కొంత మాత్రము చేయగలవిగనో ఉండును. అటులనే పరిశుభ్రమై సదా 'సప్లయి' చేయగల స్థానముమిక్కిలి లోతునందుగాని ఉండదుఅట్టిదే ఈ యోగము ఎన్నో 'స్టెప్పు' దాటినగాని మహత్తరమై, చిరమై, ప్రకాశవంతమై ప్రజ్వలించు మహాశక్తిని దర్శించుటకు వీలుగాదు. ఒకొక్క 'స్టెప్' నందలి ఫలము ననుభవించి ఆత్మానుభూతితో స్థిరస్థానముగాంచ వచ్చును. ఇట్లాత్మానుభూతి నొందిన వానికి బాహ్య వృత్తులన్నియు తొలగిపోవును.

సంగీతమందలి వాద్యనాదముల వలన ఆనందము కల్గినట్లు, దేహాంతర్గత మైన ఆత్మయందలి దివ్యనాదములు మన వీనులకు విందొనర్చును. అప్పుడు బాహ్యనాదములు రుచింపవు. దేహమునందలి వాయువులన్నియు స్తంభించును. బాహ్య వృత్తులన్నియు దూరమగును. మనో వృత్తి మాత్రము జ్యోతిర్మయమగు పరమాత్మ స్వరూప దర్శనాభిలాషియై యుండును. అప్పుడే ఆనందమయ బ్రహ్మమును మనము గాంచ గల్గుదుము.''

మఱియు కోపమును పోగొట్టుకొను విధాన మీ విధమున గురుదేవులు చెప్పిరి.

ఒకా నొక సమయమున మనస్సు క్రోధసిక్తమై యెవరినైనా తిట్టినా, కొట్టినా, అది తనతోనే సమన్వయించుకొన్నచో అనగా తనకది జరిగినట్లు తాను భావించి తన తప్పు నెఱిగినచో ఆకోపము నాటితో నశించును.

ఒక్కెడ సుఖమున్న వెన్వెంటనే ఒక్కెడ దుఃఖమున్నది. ఇష్టమున్న కష్టమున్నది. శాంతమున్న కోపమున్నది. ఇటులనే ప్రతి విషయమునకును పవిత్రమైన దాని యందు అపవిత్రమైన వున్నవి. పవిత్రములైన వాని నపవిత్ర ములు కాకుండ పవిత్రతనే అభివృద్ధి నొందించిన దానంతనదే అపవిత్రసంచయను

నశించును. ఈ సందర్భమున 'ఇండియా'ను పురుషుడుగ 'నిజాం' స్త్రీగను పోల్చి— శాంత శమ దమాది గుణములుగల ఒక పురుషునికి క్రోధాది దుర్గుణ ములుగల (గయ్యాళి) భార్య దాపురించినచో సత్పురుషుడగు భర్త దానికి లోబడి చరించుచు దాని వలననే సర్వకార్యములు నిర్వహింప జేసికొనుచూ, దానివలన తాను పొందదగిన ఆనందమును పొందుతూ వుండవలెను. ఆమె నానాటికి సత్పు రుషుడగు తన భర్త శీలమును గాంచి క్రమముగా తన దుర్గుణములు వీడిమేలు నందెనట్లు నేటికి నిజాము ఇండియా సుహృద్భావమును గమనించినదని నుడివెను. (ఈ సందర్భమున నిజాము రాష్ట్రమున జరిగిన రజాకార్ల కల్లోలము, రాష్ట్రవిలీనము మున్నగు వృత్తాంతములు శ్రీ శాస్త్రిగారి హృదయమున నిల్చియుండును.) ✓

ఇటులనే క్రమంగా సుహృద్భావసంపన్నమైన ఒక మహాశక్తి అందరి యందును ప్రవేశించి, ప్రపంచమంతటను వ్యాపించి, ఒక 'సెంటరు' నుండి తన దివ్యకణములు ప్రజ్వలింపజేయుచు సర్వవ్యాపియై శాంతియుతముగా మహోన్నత స్థితికి దెచ్చును. అటులొనర్చుటకీ యోగమార్గ మొకసాధనము. నేటికి వున్న వానిలో అత్యుత్తమం.

22—9—48 సాయం ప్రార్థనలో — ఇంత వఱకు 'మాస్టరు' గార్ని గుఱించి యోగాన్ని గూర్చి మాట్లాడు కొనేటప్పుడు హెచ్చు తగ్గులు లేని ***Level*** గురించి అనుకొంటున్నాము. వారీ యోగాన్ని ఉపక్రమించినరోజు, మరియు వారి జన్మదినము, ఇవిగాక రెండు 'ఈక్వినాక్సు' దినములును చాల ముఖ్యమైనవి. నేటి ప్రాముఖ్యత నాడు "పర్ఫెక్షన్'' దాకా జపించవలసినదని యిచ్చిన మంత్రంతో ముడిపడినది. ఆ మంత్రార్థము అనుభూతికి గోచరించిన తర్వాతగాని ఎవరూ ఏమీ చెప్పలేరు. ఆ తర్వాతనైతే నేనూ చెప్పగల్గుతాను.

ఈ దినం ఆ 'ఈక్వినాక్స్' అంటే శ్రీ మాస్టరుగారు చెప్పినట్టు, ఇది సమత్వము నుద్బోధించు దినము.

ఒక పండును కోసిన రెండుచెక్కలగునట్లు సాక్షాద్భగవత్స్వరూపము నుండి వెలువడి ఒకే స్వరూపము రెండుచెక్కలుగా నీ ప్రపంచమున వేయబడినవి. వీని పరిణామస్థితి వేరువేరుగానే యుండి దైవనిర్ణయముచే వేర్వేరు వ్యత్యాసములు

గను, సమానముగను సమకూరుచుండును. ఇది ఎట్లాగంటే భార్యాభర్తలు సృష్టి స్వరూపమునందు భిన్నములుగా గన్పట్టినను, భగవత్స్వరూపమున నొకటే. ఇట్లు ఒకటిగా నున్నది, రెండు పాయలైన పండు చెక్కలు వ్యతిరేకముగా నొకదానిలో నొకటి సమానముగా చేరిపోయినచో మరలపూర్ణమగు పండగును. అటులనే ఈ దేహము పండువంటి 'గ్లోబ్'—

స్త్రీ పురుషులు ఒక 'గ్లోబ్' వంటివారు. స్త్రీ ఒక భాగము, పురుషుడొక భాగము. ఈ సందర్భమున ఒక యోగమిత్రు డొసగిన చీనీపండు (బత్తాయి) రెండుగా కోసి ఉదాహరణముగా శ్రీ శాస్త్రిగారు చూపించారు. కోసిన రెండు చెక్కలు చేరినచో పూర్ణత్వము. వ్యతిరేకంగా నొక దానిలో నొకటి కలిసి పోయినను పరిపూర్ణత్వమే.

స్త్రీ వెన్నెముకయు, పురుషుని వెన్నెముకయు రెండును చేర్చి చూచిన ముందుగను, వెన్కగనైన నొక వృత్తమువలె కన్పట్టును. పండు చెక్కలు సమానముగా లేక ఒకటి చిన్నదిగా నొకటి పెద్దదిగా నున్న సమమైన పూర్ణమైన పండు ఏర్పడుటకు వీలుకాదు. భిన్న రూపము కల్గును. ఇట్లే సమానత్వము గల స్త్రీ పురుషులు ఆనందమును పొందగలరు. లేకున్న స్త్రీ పురుషులు పరస్పరము భిన్నముగా ప్రవర్తించుట యగును. అదెట్లాగన్నచో ఒక పండును రెండు భాగాలుగ కోసిన రెండు చెక్కలును సమానమగు స్వరూపము, రుచి, తొనలు కలిగి వుండును. వేరేయొక పండు యొక్క చెక్కను వేరొక పండు చెక్కతో జేర్చిన నొకదాని కొకటి స్వరూపము, రుచి, తొనలు భిన్నములై సమత్వము లేక యెట్లుండునో అటులనే భిన్న స్వరూపముల కూడికకును కలుగు చుండును. భిన్న స్వరూపములుగాక సమానమైన స్వరూపములకు కూడికలో పరిపూర్ణత్వము సిద్ధించును.

పరిపూర్ణత్వమనగా ఒక అర్ధచంద్రాకారముగ నున్న రేఖకు మొద లిది యనియు, మధ్యమిది యనియు, నంతమిదియనియు గుర్తింపవచ్చును. కాని, దాని రెండు కొనలను ఒకదాని నొకటి తాకునట్లు సమానముగా పొడిగించి కల్పిన నది యొక వృత్తమై ఆది మధ్యాంతములు తెలియరాని పరిపూర్ణత్వము భాసించును.

ఇటుల భార్యాభర్తలిరువురు ఒక పరిపూర్ణత్వ మొందిన వృత్తము 'గ్లోబ్' వంటివారు. స్త్రీ వెన్నెముకయు, పురుషుని వెన్నెముకయు వృత్తమునందలి సమానమైన రెండు రేఖల వంటివి ఈ యోగమున పరిపూర్ణత్వము భార్య అనుష్ఠించినను, భర్త యనుష్ఠించినను ఒక దాని నొకటి ఆకర్షింప జాలి యుండును.

మనమీ మార్గమున స్వార్థపూరితముగు ఫలమునాశించి యే కార్యమును చేయ కూడదు. అవి భగవత్సంకల్ప నిర్ణయమై యుండును. అటుల ఫలము నాశించి యొనర్చినదుష్ఫలము ప్రసాదించి వారికి దాని యందలి యుద్దేశమును బోగొట్టి సన్మార్గమున ప్రవేశింప చేయును. అప్పుడు వారే ఫలము నాశింపరు." అని గురుదేవులన్నారు.

22-3-1949న సాయం ప్రార్థనవేళ గురుదేవులు చెప్పిన దేమన- "కుంపటి యందలి నిప్పులు గాలిచే విసర బడుచు గప్పు గప్పున ఒక కణము నుండి మఱియొక కణమునకు అగ్ని ప్రజ్వరిల్లుచు నంతటను తానై ప్రవేశించి కార్యం సాఫల్యమునకు కారణమైనటుల నిదియును నొకదాని నొకటి పరస్పర సంబంధముచే ప్రజ్వరిల్లి 'బాటమ్' నుండి అంతటను వ్యాపించి తన దివ్య తేజముచే ప్రకాశింప జేయుచు నుండగలదు. ఇట్లు కుంపటియందలి నిప్పు కణికలు నొక వస్త్రముచే మూసినను అందు తన ప్రకాశమును వెదజల్లునట్లు బాహ్యాకారములచే హృదయమున బుట్టిన తేజము కప్పబడిన దానిని భేదించుకొని ప్రకాశింప గలదు. మఱియు నొక దీపముచే, చీకటియందు యెక్కడ బడితే అక్కడికి తీసికొని పోయి, మన కార్యములు చక్కబెట్టుకొను నటుల ఆ ప్రభావంతమగు వెలుగు రేఖను పట్టుకొని యెక్కడ నొప్పికలిగితే అక్కడ దానిని ప్రసరింపజేసి ఆ నొప్పి పోయేటట్లు చేసికొనవచ్చును

29-5-1949 సాయంవేళ ప్రార్థనలో- "మిత్రులారా! నాకు ముఖ్యమై, ప్రధానములైన దినములు రెండు. అవి శ్రీ మాస్టరుగారి జన్మదినము- శ్రావణ పౌర్ణమి. రెండవది ఈ పవిత్రమైన యోగముప్రక్రమించిన దినము (1910) మే నెల 29వ తేది. ఆ దినమే నేడు." తాననుభవించిన అనుభూతులను, వాని ఫలితములను విపులముగ జెప్పిరి. 'గ్రేట్‌వార్' విషయములను వార్తా పత్రికలందు చదువుచుండునపుడు తనకు కల్గిన హృదయాందోళన చెప్పతరముగాదన్నారు.

మఱియు, మద్రాసులో నొకప్పుడు తమకు జబ్బు చేసి ప్రాణమునకే ముప్పు కలుగు చుండుటచే నొక మిత్రుడు కుంభకోణంలోని శ్రీ మాస్టరుగారి దగ్గరకు వెళ్ళిన నీ జబ్బు పోగలదని చెప్పుటయు, నంతట వారి హృదయమున నొక పాయగా నేదో యొక మార్గము తోచి అదియ పరమార్థమునకు మార్గమని యుద్బోధ కల్గుటయు, వెంటనే పాతిక రూపాయలతో కుంభకోణము వెళ్లుటయు, శ్రీ మాస్టరు గారు తన యింటిలోనే భుజించ వలసినదని యాజ్ఞాపించుటయు, శ్రీ మాస్టరు వారి సన్నిధిని ప్రార్థన చేయుటయు, వారుతమ్మనుగ్రహించుటయు, తాము స్వస్థత చెందుటయు వివరించిరి.

సీతాఫలముపండ్లు మిక్కిలిగతినుటచే తనకు కల్గిన అస్వస్థత, నమ్మని మిత్రునకు 'టెలిగ్రాం' మూలముగ శ్రీ మాస్టరుగారు చికిత్సచేయగా నతడు స్వస్థత జెందుట ప్రత్యక్షముగా నెఱుకపరచి నమ్మిక కల్గించుటయు వచించిరి.

''శరీర పరిశోధనయే పరమార్థమనియును, ఒక మహాపురుషుడు ప్రపంచ మును తన శరీరముతో నన్వయించి శరీరమును సూక్ష్మాణువులచే నిర్మించుకొనుచు వచ్చి,సర్వము పరిపూర్తియొనర్చియు పూర్తికానందున అందు తానే నిల్చి పరిపూర్తి యొనర్చెను. అదియే పరమార్థము. అదియే పరమాణువు. సర్వవ్యాపియై ప్రతి యణువునందును తానయై వెలుగు పరంజ్యోతి. అదియే 'బాటమ్'. అదియే మూలా ధారం." అనివచించి నాటి ప్రార్థనోపన్యాసము ముగించుచు నేడీ యోగము ప్రారం భమై ఈనాటి సాయంకాలము 8 గం. లకు 40 ఏండ్లు నిండి 41వ ఏడు ప్రారంభ మగును. నేటితో నొక 'సర్కిల్' (వృత్తము) పూర్తియైనదని భావన- అని గురు దేవులు సరిగా 8 గంటలకు మరల ప్రార్థనగావింపుడని యాజ్ఞాపించిరి. ఆ సమావేశమునకు కుంభకోణము నుండి మాతృశ్రీ గారు (మాస్టరుగారి సతీమణి) వచ్చియుండిరి. ఆమె సందర్శనము నన్ను ధన్యుని గావించెను. 8గంటలకు ప్రార్థనానంతరం గురుదేవులిట్లు ప్రవచించిరి. నేను కుంభకోణమున "మాస్టరుగారి సన్నిధి నున్నపుడు జరిగిన నాయనుభూతి నెఱిగింతును. కుంభకోణమున యోగ పాఠశాలకు ఒకవైపు పురీషస్థానము. మరొకవైపు మూత్ర స్థానములున్నవి. ఈ నడుమ పవిత్రమైన మూర్తియా ? అను నొక ప్రశ్ననాలో కల్గి మనసు వికారము గూర్చినది. దానిని గూర్చి శ్రీ మాస్టరుగారినడిగి తెలిసికొన ప్రయత్నించితిని. అడిగిన నేమనునో ? అది యపహాస్యమగునేమో ! ననుభీతిచే నూరకొంటిని.

ఆ తర్వాత నేనటనున్న ఒక రాత్రి ప్రార్థనలో నాకే సమాధానము వచ్చి నది. 'నీ దేహమున నొకవైపు మూలాధారమగు పురీషస్థానము. మఱొకవైపు మూత్రస్థానము. నీ రెంటినడుమ పవిత్రమగు పరమార్థ స్థానము. పరంజ్యోతిని ప్రకాశింపజేయు కుండలినీ స్థానము' అని తెలియదా ? అను అనుభూతికల్గెను."

ఆ మర్నాడుదయపువేళ ప్రార్థనానంతరం (30 5 1949) తాము తమ యోగానుభవ జీవితమును వ్రాయదలచి నట్లును, అది 'ప్రజ్ఞాప్రభాకరము' అను గ్రంథమనియు. అది వ్రాయ 'మాస్టరు'గారే తమ్ము ప్రేరేపించినట్లును, దానికై ప్రారంభించి కొంత వ్రాసియుండుటను చెప్పిరి.

23.8 49 న గురుదేవుని సన్నిధిని ప్రార్థన చేయువేళ నాలో నా జీవితమును గూర్చియు, యోగమును గూర్చియు నీవిధమగు ప్రశ్నలుదయించినవి.

1. ఈ పురుషుడు ఈ యోగము మూలమున పరమార్థమును కనుగొనుటకు సాధ్యమగునా ?

2 దీనివల్ల లాభ నష్టము లెవ్వి ?

3. ఈ యోగము వ్యాపింపజేయు నీ మహనీయుని యనంతరము దీనిని ఫలవంతముగా నొనర్చువారెవరు ?

4. దీనియందలి సూక్ష్మస్థానము కనుగొనుటకు మన మర్హులమా ?

5 నా జీవితమున కలుగు కష్టముల దీర్చని దీనివల్ల నాకేమి లాభము ?

6. ఒక్కొక్కపుడు శాంతమైయుండు మనస్సు కోపాది దుర్గుణములకు లోనుగావడమెందుకు ?

7. సాంసారిక వ్యవహారముననే మునిగి యుండుటకన్న పరమార్థ తత్త్వమే ప్రధానముగా నెందుకుండగూడదు ?

8. సర్వము త్యజించి అరణ్యములు మున్నగు యేకాంత నివాసములలో నీ మార్గమున పరమార్థమును గ్రహింపవచ్చునా ?

9. మనస్సేలకో యొక్కొక్కపుడు దుఃఖ భాజనమైన విషయముల దలంచు చున్నది. ఏల ?

వీనిని గురుదేవునకెఱిగించి తెలియనుద్యమించి వారితో నేకాంతముగా భాషింపదలచితిని. కాని, ప్రార్థనానంతరము గురుదేవుడు చెప్పిన యుపన్యాసములో నా ప్రశ్నలకు చక్కని సమాధానములు తెలిసినవి. వాని సారాంశమిది –

ఈ యోగ మార్గమున కలుగు అనుభవములలో కొన్ని లాభముగను, కొన్ని నష్టముగను కలుగుచున్నవి. కొందఱకు చికిత్స చేసిన నయమగుటయు, కొందరికి కాకుండుటయు, తటస్థించుచున్నది. సక్సెస్ అయినపుడు సంతసము. 'ఫైల్' అయినపుడు విచారము కల్గుచున్నది. అయినను ఈ యోగమున పరమ స్థానమును కనుగొని యీ శరీరమున నీ మార్గమును తెరుచుకొని యందులో పోగాపోగా, ఎప్పుడో ఆ స్థానాన్ని తెలిసికొన్నపుడు, ఇది పూర్ణంగా 'సక్స' సై ప్రపంచమంతటికి కావలసిన శక్తిని 'సప్లై' చేస్తుంది. మనలో ప్రతి 'ఆటం' అట్లా ప్రసరిస్తే యెక్కడా ఏ ఒడుదుడుకులు లేక అంతటినీ మాస్టర్ తత్వం తనతో సమానంగా 'లెవల్' చేసికొంటుంది.

ఇట్లా మార్గం తెరుచుకొని లోపల ప్రవేశిస్తూ, గమ్యస్థానమును, అనగా, 'బాటం ఆటం' ను సమీపించే దానికి వెళుతూ వెను దిరిగి మీదికి చూస్తే పైదంతా మహా భయంకరంగా గోచరిస్తుంది అది అట్లా గోచరించడం బాహ్యానికి స్వభావం. దాని పనేదో అది చేస్తూనే వుంటుంది. కాని నిలుపదు అప్పట్లో దానికి భయపడక మన మార్గముగనే వెళ్లుమా మనం వెళ్ళదలచిన స్థానాన్ని సమీపించామంటే– అవన్నీ పటాపంచలై పోతాయి. అంతవఱకు దాని పనేదో ఆనే చేస్తూంటుంది.

ఇప్పుడు నే నిందులో సంపూర్తిగా 'సక్సను' కాకుండా వుండిన నాయనం తరమిట పరిపూర్ణత్వ సిద్ధి నొందునా?" అనెను. ఇప్పట్లో నేను నా మనస్సున తోచిన ప్రశ్నకు ఆ మహనీయుని వాక్కున సమాధాన ముదయించుట తెలిసి యాశ్చర్యపడితిని. నాలోనే నిట్లనుకొంటి, ఈ యోగబీజమును నాటిన మహనీయుడు శ్రీ 'మాస్టరు. సీ. వి వి' గారు కొంతవఱకు పెంచి వీరి చేతికిచ్చి సంరక్షణ భారము నీయనపై మోపెనేమో, నేటివరకీతదద్దానిని పోషించుచున్నాడు.

ఈ మహనీయునికి శతాయువు, నారోగ్యమును ప్రసాదించి తాను పోషించిన ఈ యోగవృక్షము ఫలవంతమై వెలయునట్లు, ప్రపంచమునకు శాశ్వతానంద మొసగవలెనని నేను దేవుని ప్రార్థించి నమస్కారమొనర్చితిని.

గురుదేవుడా నాడెన్నో విషయములు ప్రస్తావించి నా ప్రశ్నావళికి సమాధానము లిచ్చెను. ఎప్పటి కప్పుడు జ్ఞాపకమున్నంతకు సూచన ప్రాయముగా ఆయా విషయము లిట్లు వ్రాసియుంచుకొంటిని. ఇవి నా భవిష్యజ్జీవితమునకు బాటలు తీర్చునని నా యాశ,—



## గురుదేవుని మహితోక్తులు

— ప్రార్థనయందు శ్రద్ధ చేయకుము.

— నిర్గుణ పరబ్రహ్మ స్వరూపము నెఱుగుట కింకను వ్యక్తి పరిపూర్తి నొందలేదు.

— నిశ్చలమైన మనస్సును ఆత్మయందు లయింప జేసికొనినపుడే యది సాధ్యము.

— ప్రపంచమున నుండు ప్రతిమలిన వస్తువును నీవెట్లసహ్యించుకొనెదవో, అట్లే నీ దేహమున, నీ మనమున నుండు చెడ్డ నసహ్యించుకొనుము పవిత్రవస్తువేదో కనుగొనుము దానిని గ్రహింపుము.

— గాయత్రీ సంభూతుడనైననేనును, శ్రీగాయత్రియు భేదములేకుండునది.) అదే నిన్ను రక్షింపగలదు. (ఈ వాక్యం 'మాస్టరు' గారుచెప్పినది.

— హృదయ దౌర్బల్యమున రాబోవు వానిని తలచి మరింత దుర్బలుడవు గాకుము.

— నిశ్చలమగు నీతత్త్వానందమే నీకు, నీ చుట్టునున్న వారికి ఆయురారోగ్య భాగ్యములు కల్గించును.

— మహామహుల విషయ ప్రస్తావమున నిర్ణయానిర్ణయములు త్వరపడి చేయక మౌనముగా నుండుము. మన మందుకోలేని వారి మహత్వమును మన మెఱుఁగ జాలము. వారి మహాశక్తికొక నమస్కారము తెలిపిన చాలు.

— దివ్యజ్యోతిని దర్శించుటకు శరీర మనేకకష్టముల ననుభవింపవలసి యుండును. వానిని ధైర్యముతో నిర్వహింపుము.

— వివేకముతో మెలగుము.

— స్థిర సంకల్పుడవై యేదేనొక కార్యమును జేయుచుండుము. ఒక దాని వెంట నొకటి సాధింపుము. దైవసాయముండును.

— మనోదార్ఢ్యము, ధీవికాసము, ఆరోగ్యము వర్ధిల్లుటకీ యోగమార్గము సులభ సాధనమేగాక, బ్రహ్మతత్త్వ మెఱుగుటకు తోడ్పడును. సమిష్టిసాధనమున నిది యుత్తమోత్తమమైన నవ్య, దివ్యయోగము.

(గురుదేవులు ప్రార్థనానంతర ప్రసంగములను అప్పటికప్పుడే డైరీలుగా వ్రాసుకొన్నవారు కొందరు కలరు. అవి కొన్ని ప్రకటింపబడినవి. శ్రీ మైనంపాటి సుబ్రహ్మణ్యంగారు అట్టి ప్రసంగములను తాము విన్న వానిని కొన్నిటిని తేదీల వారీగా గుర్తు చేసుకొని వ్రాసి యుంచుకొనినట్లు చెప్పిరి. ఆయా విషయములను వారు తమ కవగాహనమైన తీరున తమ భాషలో వానినిట్లు పొందుపరచిరి. తిరుపతిలోని శ్రీ శ్రీనివాసాచార్యులవారి ప్రేరణమున వారు మాకు పంపిన రచనలలో ఇది ఒకటి. వారికి మా కృతజ్ఞత- సం॥)

# గురుసాక్షాత్ పరబ్రహ్మ

—శ్రీ శార్వరి

భగవద్గీతలో 'యోగం' అనే పదాన్ని అనేకార్థాలలో, అనేక సందర్భాలలో వాడడం జరిగింది. సామాన్య ప్రజలు కూడా 'యోగం' అనే మాటను యధేచ్ఛగా వాడుతున్నారు. 'ఫలానా వాడి యోగం' బాగుంది అంటారు. అంటే అదృష్టం అని అర్థం కానీ ఆత్మ- పరమాత్మల సంధానమే యోగం అనుకోవాలి వంటపని చేసినా, కుట్టుపని చేసినా యోగమేననీ, అదీ కర్మ యోగమే కనుక 'ముక్తి' లభిస్తుందని అంటే ఎలా నమ్మటం? అలా అనేవారు తాము ఆ వంటపనే చేసుకోవచ్చుగా. ఎందుకు తపస్సు చేయడం? సంయోగం, వియోగం కూడా యోగ వికారాలే ఆధ్యాత్మిక వికాసంతో సత్యసాధనకు చేసే తపస్సు ఒక్కటే యోగం, ఇతరాలు కావు, కాలేవు. మనం చేసే దేవతా పూజలు, స్తోత్రాలు పారాయణాలు, వ్రతాలు, కర్మ కాండలు, తీర్థయాత్రలు ఏవీ 'యోగం' క్రిందికి రావు. యోగం 'ఆత్మ'గత సంస్కారం.

ఒక్క ఆత్మ- పరమాత్మ పరంగా తప్ప, ఇతరత్రా 'యోగం' అనే మాటను వాడకూడదు. ఆసనాలు వేయడం కూడా యోగమే నంటున్నారు. 'యోగం'అంటే ప్రాణాయామం, శరీర వ్యాయామం, ఆసనాలు అనే పరిమితార్థం ప్రచారంలోకి వచ్చింది. పూర్వం ఆసనాలు, ప్రాణాయామం ధ్యానానికి ముందర అవసరమైన ఎక్సర్‌సైజ్‌గా భావించారు. వాటివల్ల శరీరానికి ఆరోగ్యం, మనస్సుకు నిర్మలత్వం ఏర్పడుతుంది. అవే 'యోగం' కాదు. 'యోగం' ఆత్మకు సంబంధిం

చెందినవి. ఆత్మ ధ్యానానికి, తపస్సుకు సంబంధించినవి. క్షేత్రమని, క్షేత్రజ్ఞుడని అంటారు. తపస్సు వల్లగాని ఆత్మ సంస్కారం ఏర్పడదు. ఆత్మ సంస్కారానికి అవలంబన యోగం. ధార్మిక జీవనం సత్యాచరణం—మంత్రంతో చేసినా, మంత్రం లేకుండా చేసినా యోగసాధన ఒక్కటే. మనోభూమిక దాటి ఆత్మ సామ్రాజ్యంలో ప్రవేశించి, శూన్యంలో నిలిచిపోవాలి. అందుకు యోగసాధన ఒక్కటే సహాయ పడుతుంది. పురుష ప్రయత్నంలేనిదే ప్రకృతి సహకరించదు. ప్రకృతి సహకారం లేనిదే మానవ ప్రయత్నం ఫలించదు. అది ఎలా సాధ్యం అంటే, మనం ఎంత ఆడంబరంగా ప్రయత్నించినా ఫలితం శూన్యమే. నిర్మలమైన మనస్సుతో హృదయాంతరాలలోకి వెళ్ళగలగాలి. అప్పుడే ప్రజ్ఞ, అంటే ఈశత్వం మనలో ప్రవేశిస్తుంది. అది మనం అడిగితే, అర్థిస్తే లభించదు. మనం సంపూర్ణ సమర్పణతో సిద్ధం అయితే, ఆ బ్రహ్మత్వం లేదా ఈశ్వరీయత, లేదా దివ్యకాంతి మనలో చోటు చేసుకుంటుంది. అలాగ దివ్యత్వం ఒక అణువుగా, ఒక వెలుగుకిరణం వలె, లేదా ఒక చైతన్య స్పందనగా మనలో ప్రవేశించడమే యోగ క్రియకు ఆరంభం. ఆ తపన పెరిగి పెరిగి మొత్తం శరీరం, మనస్సు, ఆత్మ సమాయత్తం కావాలి ఆలా సిద్ధం కావడానికే మన సత్సంగాలు, సద్గ్రంథ పఠనాలు, సత్క్రియలు, పూజలు, వ్రతాలు, దేవాలయ సందర్శనాలు, తీర్థయాత్రలు. ఆపని జరిగిన తర్వాత ఇవేవీ బొత్తిగా అవసరం లేదు. మన చదువులు నిరుపయోగం. మనం ఆర్జించిన జ్ఞానం నిష్ప్రయోజనం. మన తీర్థయాత్రలు, పూజలు, వ్రతాలు, దేవుళ్లు-అన్నీ అనవసరం. అంటే దివ్య ప్రజ్ఞను పొందిన యోగి ఏ గుడికీ వెళ్ళడు, ఏ దేవుడికీ మొక్కడు. ఏ తీర్థాలు సేవించడు, ఏ గ్రంథాలు చదవడు, ఎవరి న్యాసాలు వినడు. అతను చేసేదల్లా ఒక్కటే. ధ్యానంలో శూన్యంలోకి వెళ్ళడం, తన హృదయాంతరంలోనే సమస్త విశ్వాన్ని, అనంత సృష్టిని, చివరకు పర బ్రహ్మను దర్శిస్తాడు. అందుకే అతను ఏ మంత్రాలను ఆశ్రయించడు. అతనికి తంత్రాలు అవసరంలేదు. చివరకు వేదాలు, ఉపనిషత్తులుసైతం యోగికి అనవ సరమే. పూర్ణసత్యాలేవో అతనికే తెలుస్తాయి. అతని హృదయానికి అందినవే సత్యాలుగా గ్రహిస్తాడు. మిగిలిన వాటికి విలువ యివ్వడు.

ఈ రహస్యం తెలియకనే లోగడ అనేక మంది బ్రాహ్మీస్థితిని చేరలేక పోయారు. ఎవరూ శాశ్వతత్వాన్ని సాధించలేకపోయారు. అంటే భౌతిక శరీరాన్ని వదలిన 'ఆత్మ' స్వర్గంలోకి వెళ్ళిందే తప్ప లేదా మోక్షం ద్వారా పరమాత్మలో

కొంత కాలం జరిగిందేతప్ప 'శాప' పర్మనెంట్‌గా ఉండలేకపోయింది. అనా లోగడ తపస్సు చేసినవారు ఆ లక్ష్యంతో చేయలేదు. మనం తపస్సు ఏ లక్ష్యంతో చేస్తే అదే సిద్ధిస్తుంది. విత్తు ఒకటి వేస్తే చెట్టు మరొకటి మొలవదు గదా! లోగడ మన ఋషుల, మహర్షుల లక్ష్యం వ్యక్తిగత మోక్షం. విశ్వ పరిణామం కాదు ఇప్పుడు అధునాతన యుగంలో వెలసిన యోగమూర్తులు, యోగాన్ని విశ్వ పరిణామ సాధనగా స్వీకరిస్తున్నారు ఆ లక్ష్యంతో ప్రయోగాలు చేసి, యోగాన్ని సుప్రతిష్ఠితం చేసిన మాస్టరు సి.వి.వి. శాశ్వతులు. ఆయనవలె.మనమూ మనఆత్మలకు శాశ్వతత్వాన్ని సిద్ధింప చేయగలం— ఈ యోగ మార్గంలో.

గౌతమ బుద్ధుని కాలం నుండి ప్రతి ప్రవక్త మృత్యువును జయించాలన్న సంకల్పంతోనే సాధన చేస్తున్నాడు. మృత్యువును జయించడం, రోగాలను నిరోధించడం, ముసలితనం లేకుండా అంటే జర,రుజ, మృత్యువులను జయించాలని చేసే తపస్సు ఫలిస్తుందా? యోగ సాధనతో సాధించవచ్చు. మాస్టరు యోగంలో మొదటి ఫలితమే రోగ విముక్తి. ప్రతి సాధకుడు రోగాల నుండి విముక్తుడవుతాడు. రెండవది ముసలితనాన్ని జయించడం. శారీరక, మానసిక ఆరోగ్యం కాపాడు కున్నవాడు ఆత్మబలంతో యువకుడుగానే మెలగగలడు. ముసలితనం వయస్సుది— ఉత్సాహం మనస్సుది. ఆత్మబలం కలవాడు నిత్యయౌవనుడే. మృత్యువును జయించడం సాధ్యమా? శరీరం ప్రాణాన్ని నిలపగల స్థాయిని, కోల్పోయినపుడు నశిస్తుంది. భౌతిక శరీరంలోని 'యాస్ట్రల్' శరీరం శాశ్వతంగా ఉంటుంది. అలా శాశ్వతంగా ఉంచగలశక్తి ఒక్క యోగికి మాత్రమే లభిస్తుంది. అంటే శరీరం లేకపోయినా, ప్రజ్ఞ వుంటుంది.ఇప్పుడు మాస్టరుగారి ప్రజ్ఞ మనలో అణువణువునా పనిచేస్తూ మనల్ని ప్రభావితం చేస్తున్నది. భౌతికశరీరాన్ని భూమి పైన నిలపడం అసాధ్యం. అందుకు చేసే ప్రయత్నం నిష్ఫలం. కాని స్టెబిలిటీని శాశ్వతంగా నిలుపుకోవచ్చు.

యోగం వల్ల, తపస్సు వల్ల మనిషి శాశ్వతుడు కాగలడా? సిద్ధులు సంపాదించిన వారనేకులున్నారు. ఆకలి దప్పులు లేకుండా వందల సంవత్సరాలు తపస్సు కొనసాగిస్తున్న వారున్నారు హిమాలయాల్లో. ఈ ప్రాపంచిక సుఖాలు అవసరం లేనప్పుడు ఎన్ని సంవత్సరాలు జీవించివున్నా ఒక్కటే. ప్రపంచంతో అవసరంలేనప్పుడు ప్రపంచంలో ఉండడమూ అనవసరమే.కనుక భౌతిక శరీరాన్ని వదలడం అవసరం. ఆత్మ పూర్ణత్వాన్ని సిద్ధింప చేసుకున్నప్పుడు శరీరం దేనికి?

జీవుడు మరొక జన్మఎత్త నవసరంలేనప్పుడు, ప్రతివారు ఈ శరీరాన్ని వదలి వేస్తారు. శరీరంలో ఉండటమనే భారమనిపిస్తుంది. కనుక భౌతిక శరీరాన్ని శాశ్వతంగా నిలిపే ప్రసక్తి లేనేలేదు. శాశ్వతంగా నిలవగలిగిన యాస్ట్రల్ శరీరాన్ని తయారుచేసుకొనడానికే యోగం.

గతశతాబ్దం ఉత్తరార్థంలో జన్మించి, ఈ శతాబ్దం ప్రథమార్థంలో యోగంలో ఎంతో ముందుకువెళ్ళి కొత్త ప్రయోగాలుచేసి, యోగానికి కొత్త నిర్వచనం ఇచ్చిన మహాత్ములు షిర్డీసాయి, మాస్టర్ సి.వి.వి, అరవిందయోగి, రామకృష్ణ పరమహంస, రమణ మహర్షి. వీరు అయిదుగురిని పంచమహాపురుషులుగా గుర్తించవచ్చు—ఎవరికివారు, వీరు దివ్యచైతన్యాన్ని అందించడానికే ప్రయత్నించారు. వీరిప్రభావం భారతదేశంలో నాలుగుదిక్కులా ప్రసరించింది.

దక్షిణభారతంలో మాస్టర్‌గారు కుంభకోణం (అగస్త్య మహర్షి క్షేత్రం) కేంద్రంగా హాలీస్‌కామెట్ నుండి మహాశక్తిని అందిపుచ్చుకుని కొత్తయోగాన్ని ఆవిష్కరించారు—పూర్వ యోగసాధనలన్నింటిలోనూ మంత్రాల్ని ఉపాసించడం వల్ల కలిగే యోగాగ్ని రగిలి,దానిశక్తి కుండలినిని లేపడం- అది షట్చక్రాలద్వారా ఊర్ధ్వగతిని పయనించి బ్రహ్మరంధ్రాన్ని చేరడం, బ్రహ్మ రంధ్రం ద్వారా, అది నిష్క్రమించడమే బ్రహ్మభేదనం అనీ, మోక్షమనీ అంటారు—అదే కపాల మోక్షం. మాస్టర్ సి.వి.వి, అరవిందులు, రమణ మహర్షి, రామకృష్ణ, సాయి, వీరంతా తద్భిన్నంగా సాధనచేశారు. దివ్య చైతన్యాన్ని సరాసరి పై నుండి తమలోకి తెచ్చుకునే ప్రజ్ఞకు ప్రాధాన్యత యిచ్చారు. మాస్టరుగారి యోగంలో ఒక ప్రజ్ఞ పైనుండి బ్రహ్మ రంధ్రంగుండా మనలో ప్రవేశించి, మన శరీరాన్ని చైతన్యవంతంచేస్తూ కుండలిస్థానం చేరుతుంది. అప్పుడు నిద్రిస్తున్న కుండలినీ శక్తినిద్రలేచి ఒకచైతన్యంగా, కాంతిగా, హృదయస్థానాన్ని, అంటే అనాహతాన్ని చేరుతుంది. అదే యోగస్థానం. ధారణ జరగవలసింది హృదయంలోనే ఇక్కడ మనం చేయవలసినపని సమర్పణ. మనలో చైతన్యం ప్రవహింపచేసేది మాస్టర్. మనకూ మాస్టరుగారికీ 'లింక్'ఏర్పరచేది భౌతికంగావున్న గురువు.

ఇక్కడ చాలామందికి ఒక పెద్ద సందేహం కలుగుతుంది. ఎలా ప్రచార మైందోగానీ, ఈ మార్గంలో గురువు అవసరంలేదనీ, ఎవరికి వారు స్వతంత్రంగా

చేసుకోవచ్చునని ఒకవాదం. గురువు అంటే పరంపరలో వస్తున్న ఆచారంవేరు. గురువును సేవించగా ఆయన అనుగ్రహించి మంత్రాన్ని రహస్యంగా ఉపదేశిస్తే దాన్ని సిద్ధి పొందేవరకు జపించడం పద్ధతి. మాస్టరుగారు ప్రతివారికి *Independent development* కు అవకాశం కల్గించారు. అంటే, అడుగడుగునా గురువు గారికి పాదపూజలుచేయక, ఆయన ఆగ్రహానికి గురై, దూరం కానవసరంలేదు. ఇక్కడ పద్ధతివేరు. మాస్టరుగారే మహాగురువు నాడీగ్రంథంలో 'మహాగురు' పదాన్ని ఉపయోగించారు మాస్టరుగారి విషయంలో. ఆ రోజుల్లో మీడియమ్స్ అందరూ మాస్టర్‌గారిని 'గురుదేవులు'గా ఆరాధించడమే కాక, 'పరబ్రహ్మ' స్వరూపులుగా భావించారు. ఆయన తన శిష్యుల్ని కొంతకాలం 'మీడియమ్స్'గా ట్రీట్ చేసినా, వారందరూ తన శిష్యులుగానే పరిగణించారు. మాస్టరుగారు సశరీరులుగా వున్నంతకాలం ఆయనే గురుదేవులు. తన తర్వాత 'ఉపదేశం' చేసే అర్హతను ఆయన ఎవరికీ యివ్వలేదు. ఇవ్వలేదంటే పరిగణించలేదని అర్థంకాదు. ఎవరిలో ప్రజ్ఞ పరిపూర్ణంగా వికసిస్తుందో, ఎవరికి యోగసాధన పూర్తిఅయి, సిద్ధి లభిస్తుందో వారికి ఉపదేశార్హత కలిగించారు, కలిగిస్తున్నారు. 'గురువు' అన్న పదవి ఎవరికివారు కల్పించుకునేది కాదు. ఆ ప్రజ్ఞ మాస్టరుగారు ప్రసాదించాలి. ఆ ప్రజ్ఞ వారికి అలవడాలి మాస్టరుగారి చైతన్యం 'గురువు'లో నుండి శిష్యునిలోకి ప్రసరించాలి. వేయిమంది సాధకులలో పదిమందికి 'గురువు'అయ్యే అర్హత కలగకపోవచ్చు. మాస్టరుగారు ఉన్నంతకాలం ఆయనే గురుదేవులు, ఆ తర్వాత కొంత కాలానికి శ్రీ ఎం.ఎన్. గారు, ప్రభాకరశాస్త్రిగారు, ఎన్.ఆర్.బి.వి గారు శిష్యగణాన్ని చేరనిచ్చారు. వారిలో శ్రీ ప్రభాకరశాస్త్రిగారు ఎవరికీ ఉపదేశం యివ్వలేదంటారు గానీ వారి ప్రజ్ఞలో ప్రభావితులై ఈ యోగం సాధన చేస్తున్నవారున్నారు. శ్రీ ఎం.ఎన్.గారిని మాస్టరుగా వారి శిష్యవర్గం గౌరవించి పూజిస్తున్నది ఇక్కడొకచిన్న వివరణ అవసరం. మాస్టరుగారున్నంత కాలం వీరెవరూ గురువులు కాలేదు. శ్రీ ఎం. ఎన్. గారున్నంతకాలం ఆయన ఒక్కరే గురువు. ఆయన శరీరాన్ని విడిచి పెట్టిన తర్వాత ఆయనే మాస్టరు. అంటే ఫిజికల్‌లో ఉన్నంతకాలం 'గురువు'. ఫిజికల్ వదలిన తర్వాత మాస్టర్ గారిలో కలిసిపోయినట్లు కనుక మాస్టర్‌అయి పూజనీయులవుతున్నారు. అంటే మాస్టరు యోగంలోసైతం 'గురువు' అవసరమే. సాధనచేసిన ప్రతివాడు గురువు కాలేడు. 50 సంవత్సరాలు తపస్సు చేసినా కొందరికి మాస్టర్‌గారి పర్మిషన్

లభించకపోవచ్చు. ఒక 'గురువు' సజీవంగా ఉండగా, ఆయన శిష్యులు ఎంత గొప్పవారైనా 'గురువు' కావడం అసంభవం, అసంగతం. ఆ గురువు మాస్టరుతో కలిసి పోయినప్పుడు, ప్రజ్ఞావంతుడైన శిష్యునికి గురుస్థానం లభిస్తుంది.

నా ఉద్దేశంలో 'గురువు' అవసరమే. గురువు లేనిదే ఎవరూ యోగంలో ముందుకు పోలేరు. కొన్నాళ్లకు మాస్టరుగారి దర్శనంఅయి ఆయనే నడిపిస్తారు. ఆ తర్వాతనైనా 'గురువు' గైడెన్స్ అవసరమె. మాస్టరుగారి శక్తి ప్రవాహాన్ని భరించేశక్తి, తట్టుకునేశక్తి సామాన్య సాధకులకు ఉండదు. ఆ మహాశక్తి గంగను భగీరథునివలె గురువు భరించి సాధకులకు పంచియిస్తాడు. అందుకే 'గురువు' అవసరం. ఆ 'గురువే' మాస్టరుగారిఅంశ. శరీర త్యాగం తర్వాత గురువే మాస్టరు అవుతారు. ప్రతిసాధకునికి తనగురువే మాస్టరు. ప్రజ్ఞ ప్రతి గురువులోనూ ఉండి తీరుతుంది. లేకుంటే యోగంలేదు. ట్రీట్‌మెంట్ ఉండదు.

[illegible] మాస్టరుగారు మీడియమ్స్ అన్న వారంతా మాస్టరుగారి ప్రయోగాలలో సాధకులు, పరికరాలు. కొందరిచేత కొన్ని కొన్ని కోర్సులు చేయించి ఫలితాల్ని రాబట్టేవారు. 12 సంవత్సరాల ప్రయోగ ఫలితాలు ఆ తర్వాత తరం సాధకులకు ఉపయోగ్యాలైనాయి ఇప్పుడు ఈయోగంలో 'గురువు'ను మాస్టరుగారి స్వరూపంగా భావించగలిగిన వారికే యోగాభివృద్ధి కలుగుతుంది. ధ్యానంలో ఉన్నంత కాలమైనా గురువు మాస్టరుగారితో సమానమే. మాస్టరుగారి ప్రజ్ఞను గురువు తన 'స్పర్శ'తో శిష్యునిలో ప్రవేశింపచేయాలి. ఆ పని స్పర్శ ద్వారా, చూపు ద్వారా, భావన ద్వారా, ఎలాగైనాకావచ్చు-అందరికీ మంత్రోపదేశం చేయనవసరంలేదు. కళ్లలోకి చూచి, గురువు తన సంకల్పబలంతో ప్రభావితుల్ని చేయవచ్చు. లేదా, స్పర్శతో అతనిలోకి దివ్యాంశను ప్రవేశపెట్టవచ్చు. లేదా, కేవలం 'సంకల్పం'తో ప్రేరణ కలిగించవచ్చు-అన్నీ ఒక్కటే. ఆ తర్వాత సాధనలో ఉపకరిస్తుంది మాస్టరుగారి నామాక్షర త్రిపుటి. ఒక ముహూర్తంలో మాస్టరుగారు లేదా ఒక తేజోకిరణం గురువు ద్వారా సాధకునిలో ప్రవేశిస్తుంది. అంటే ముందుగా గురువే శిష్యుని హృదయంలో ప్రవేశిస్తాడు. దానిని శుద్ధి చేస్తాడు. ఆ హృదయాలయం పవిత్రమైనప్పుడు మాస్టర్‌గారు అందులో ప్రవేశిస్తారు. అతని హృదయంలో నివశిస్తారు. కనుక ఎలా చూచినా'గురువు' అవసరం చాలా వుంది. గురువు నిర్వహించేపాత్ర చాలా ఉత్తమమైనది. ఉత్తమ గురువు శిష్యుని

అలాంటి సాధనని చేయాలి. తర్వాత మాస్టరు అంత ఎత్తుకు పెరగాలని ఆశిస్తాడు, ఆశీర్వదిస్తాడు.

ఒక అనుమానం రావచ్చు, వాటి యోగాలు ఇన్ని వున్నాయి కదా, అవన్నీ పనికి రానివేనా ? అని. ఎవరూ అనరు. వేటి విలువ వాటిదే. ఆయా కాలాలకు అనుకూలమైన పద్ధతుల్ని ఆనాటి మహర్షులు తయారుచేశారు. సృష్టి పరిణామంలో చాలా ముందుకు వచ్చింది. మనిషి మేధ పెరిగింది. కేవలం దేవుళ్లను నమ్మే కాలం కాదిది. ఒక అతీత శక్తి మాత్రం ఏదో వుందని ప్రతి వారు నమ్ముతున్నారు. ఆ అతీత, అతీంద్రియ శక్తిని డైరెక్టుగా అందుకునే మార్గం ఏది ? ఈ డైరెక్టులైనులో మనం సూటిగా సృష్టికి ఆది అయిన శక్తిని అందుకోవచ్చు. మిగత వాటి ద్వారా అది జరగని పని. మిగత వాటిలో శరీరానికి అవసరమైన యోగాసనాలున్నాయి, ప్రాణాయామం వుంది. ఆపైన ఎప్పుడో 'ఆత్మ' దర్శనానికి అవకాశం వుందో- లేదని అనం. అది అయ్యేనాటికి పుణ్యకాలం కాస్తా గడిచి పోతుంది. ఈ జన్మ కాస్తా పోవచ్చు. ఈ యోగంలో మాస్టరుగారు చాలా కన్సెషన్సు యిచ్చి, ఫలితాలను అందించారు. ఈ యోగంలో ఇప్పుడు చేరుతున్న వారు పూర్వ జన్మలలో అనేక తపస్సులు, యోగ సాధనలు చేసిన వారే, యోగసిద్ధి కోసం, యోగ సాధన పరిసమాప్తి కోసం మళ్ళీ జన్మించి ఈ యోగంలో చేరడం జరుగుతున్నది. ఈ విషయాన్ని మాస్టర్ యోగసాధకుల జాతకాలలో, నాడీ కర్తలు ధృవపరిచారు. కనుక మాస్టరు యోగంలో చేరే వారు సామాన్యులు కారు. ఎన్నో జన్మలలో ఎంతో తపస్సు చేసి పుణ్యమూర్తులై సిద్ధి పొందలేక. ఈ జన్మలో మాస్టరు గారి యోగంవైపు ఆకర్షితులవుతున్నారు. మాస్టరుగారి శక్తే అలాంటివారిని తనవైపు ఆకర్షిస్తున్నది. కనుక ఈ యోగంలో చేరే వారందరూ ఉపదేశం పొందిన వెంటనే, లేదా కొద్ది రోజులకే, అపూర్వ యోగానుభవాలు చవిచూడ గలుగుతున్నారు. వారందరిలో మాస్టర్ యోగా ప్రిన్సిపుల్ పనిచేస్తున్నది. పైకి మామూలుగా. నిరాడంబరంగా కనిపించినా, ఒక్కొక్కడు ఒక మహాయోగి, వీరు తమలో నిగూఢంగా వున్న శక్తుల్ని, సిద్ధుల్ని ప్రదర్శించరు. మాస్టరుగారి అనుజ్ఞ అయితే తప్ప, బయట పడరు

అసలు యోగం ఎందుకు ? ఎందుకు కష్టపడి నిష్టగా సాధన చేయాలి? హాయిగా సంపాదించుకుని అందినన్ని సుఖాలు, భోగాలు అనుభవించక, ఏమిటీ పని? అంటారు.

'యోగం' అన్నదాన్ని ఒక ఉన్మాదంగా భావిస్తారు కొందరు. శ్రీ రామ కృష్ణ పరమహంస, రమణమహర్షి వాళ్ళకు కనిపిస్తారు. సంసారాన్ని, సంసార బంధాల్ని త్రెంచుకుని సన్యసించడం అనుకుంటారు. కానీ అదేదీ కాదు. జీవితంలో ఒక క్రమశిక్షణ, ఆధ్యాత్మికచింతన యోగానికి భూమిక— ఆ చింతన ఏర్పడితే, అది పెరిగి పెరిగి, తనలోని అతీతమైన శక్తిని వెదకాలన్న జిజ్ఞాస కలుగుతుంది- ఆ అనుభవం కోసం చేసే ప్రయత్నమే యోగం అవుతుంది యోగం వల్ల మనిషి నిరాసక్తుడు కాడు, నిస్సంగుడు కాడు. జీవితాన్ని ధర్మ మార్గంలో, సత్య పథంలో నడిపిస్తాడు. విశ్వానికి మూలమైన చైతన్యంపై మనస్సును నిలుపుతాడు.

మానవ జన్మ ఎత్తినందుకు, జన్మ చరితార్థం చేసుకోవాలి. అంటే జన్మించిన కారణం తెలుసుకొని, లక్ష్యం సిద్ధింప చేసుకోవాలి. అంటే మన అస్తిత్వపు విలువలు గుర్తించాలన్న మాట. వెనక్కి వెళ్ల కూడదు. అంటే జీవుడు తిరిగి జంతు స్థితికో, వృక్ష స్థితికో, ఖనిజ స్థితికో పోకూడదు. నాల్గవ పరిణామం మనిషి. దీనిలోంచి అయిదవ పరిణామం అయిన దివ్యమానవ స్థితికి పోవాలి. అంటే దివ్య జీవనం అలవరచుకుని, సత్యసాధన చేయాలి ఆ సత్య సాధనమే సత్యయోగం. అదే సత్యయుగానికి సూటిబాట—డైరెక్టులైన్. మానవుడు అతిమానవుడు— సూపర్ మన్-కావాలన్నది మన యోగ లక్ష్యం-జరా, వ్యాధి, మృత్యువులను స్వాధీనం చేసుకోగలగాలి— జయించడం కాదు.

'ఆస్తికత్వం' అంటే దేవుళ్లను నమ్మి వారి కోసం పరుగులెత్తడం కాదు- నోములు, వ్రతాలు, పూజలు చేస్తూ అడుగడుగునా దేవతలకు బానిసలై పోవడం కాదు. ప్రతిరాయికీ మొక్కులు మొక్కి, లంచాలిచ్చి, అవసరాలు తీర్చుకుని ముడుపులు చెల్లించడం కాదు. ప్రతి దేవునికీ దణ్ణాలు పెడుతూ, ప్రతి దేవాలయంలో ప్రదక్షిణలు చేయడం మన ఎదుగుదలను మనమే నిరోధించుకోవడం— సంప్రదాయ పూజాపునస్కారాలతో, కర్మకాండలో వున్న బలహీనత. అది వాటికి స్వస్తి చెప్పినప్పుడే యోగ సాధన మనకు అలవడుతుంది. రెండు తెప్పల మీద రెండుకాళ్లు పెట్టి ప్రయాణం చేయడం కష్టం— అయ్యో పూజ చేయక పోతే దేవునికి కోపం వస్తుందేమో, ఉపవాసాలుండక పోతే భగవంతుడి ఆగ్రహం వస్తుందేమో అనే అనుమానం. వుంటే మతంనీడ మనపైన పడుతోందన్న మాట. మన చదువూ సంప్రదాయం మనల్ని స్వతంత్రంగా ఆలోచించనీయడం లేదన్న

మా: అలాగా మూఢనమ్మకాలలో చిక్కుపడి వున్నంతకాలం ఎవరికీ యోగంలో ప్రగతి ఉండదు.

యోగం చేసేది మోక్షం కోసంకాదు. అసలు మోక్షం అన్నదేలేదు. మోక్షం అంటే ఈ జీవుడు వెళ్లి భగవంతునిలో కలవడం. పరిణామంలో, జన్మ పరంపరలో ప్రతిజీవి పెరిగి పెరిగి, సంస్కారం పొందుతూ పరబ్రహ్మ స్థితిని చేరాలి, సృష్టికి, పరిణామానికి దోహదంచేయాలి. మళ్ళి జన్మవుందా లేదా అన్నది అనవసరం. పూర్వజన్మ గురించి మనకు తెలియనప్పుడు, మరో జన్మగురించి ఆలోచించడం అనవసరం పోనీ మరోజన్మ ఉన్నదే అనుకుంటే, ఆ జన్మలో ఈ జన్మజ్ఞానం ఉండదు కదా, 'మాయతెర' పడుతున్నది! కనుక ముందుగా మన జన్మల జ్ఞానం మనకు కలగాలి. అందుకు యోగం చేయాలి. జ్ఞానం కలిగితే మనం ఎక్కడ వున్నామో, ఇంకెంత దూరం పోవాలో, ఎన్ని జన్మలెత్తాలో తెలుస్తుంది. ఆ వికాసం, చైతన్యం కలిగించగల యోగం మాస్టర్ యోగం. ఆధ్యాత్మిక వికాసం, మన యోగ లక్ష్యం గాని, ఇతర స్వార్థ ప్రయోజనాలు కావు మోక్షం అన్నది వ్యక్తిగతం. యోగం అన్నది సమష్టి పరం. యోగం వల్ల మొత్తం మానవాళికి, సృష్టికి మేలు జరుగుతుంది. పూజలు, వ్రతాలు చేయటం వల్ల మనకో, మన కుటుంబానికో మేలు జరుగుతుంది.

మాస్టర్‌గారు ప్రతిపాదించిన కొత్త సిద్ధాంతం వ్యక్తిగతంగా ఎవరికీ మోక్షం సిద్ధించదని. ఇంతకాలం ఎందరు, ఎన్ని సంవత్సరాలు తపస్సు చేసినా మోక్షం పొందినవారు లేరట. అయితే పూర్వపు మహర్షులంతా ఏమైనట్లు ? ఏమవుతారు. మళ్లీ మళ్లీ జన్మిస్తారు, లేదా ఏ సత్యలోకంలోనో యోగంలో ఉండిపోతారు. పరిణామ వికాసానికే యోగసాధన అన్నది గురుదేవుల సూత్రం. మానవులు దివ్యమానవులు కావాలి, మృత్యుంజయులు కావాలి. ప్రతి వ్యక్తి యోగంలో తాను పరబ్రహ్మానుభూతిని పొందగలిగితే, పరబ్రహ్మ కార్యానికి దోహదం చేయగలడు. తాను ఒక్కడుగా చేస్తున్నది తక్కువేకావచ్చు కానీ అందరికృషి, సమష్టి కృషి అవుతుంది. యోగసాధన ప్రభావం వ్యక్తిపైన, పరిసరాలపైన, సమాజంపైన ఉండి తీరుతుంది. కొంత ప్రత్యక్షంగా కనిపిస్తే, కొంత పరోక్షంగానో, అపరోక్షంగానో వుంటుంది. ప్రతిసాధకునిలో చైతన్యం కలగాలి. ఆ చైతన్యం అందరికీ అందుబాటులోకి రావాలి.

మనం తపస్సు చేస్తే, యోగం చేస్తే ఫలితం మనకు దక్కాలి తేగదా తృప్తి, మనకూ మనవారికీ కాకుండా యితరులకు లాభిస్తే మనకు తృప్తి వుండదు. అయితే ఎవరు మనవారు? ఎవరు పరవారు? మాస్టరుగారు మనల్ని అందరినీ తన వారిను కోబట్టే, ఇంతటి కీయోగం ప్రదానం చేశారు. భగవంతుడు ఈ సృష్టి అంతా తనది అనుకోబట్టే, అందరికీ అందుబాటులో వున్నాడు. అలాగే మనమూ అందరినీ మన వారుగానే భావించాలి మన భార్యా పిల్లలే మనవారు కారు, ప్రతి మనిషి మనవాడేఅనుకునే సంస్కారం అలవరచుకోవాలి. అదే కరుణ, ప్రేమ, సహనం, సంస్కారం.

విచిత్రం ఏమంటే, యోగసాధన చేసేవారు తాముమాత్రమే యోగానికి అర్హులైనట్లు, మిగతవారు కానట్లు ప్రవర్తిస్తారు ఆధ్యాత్మికంగా సాధించవలసింది అనంతంగా వుంది. నిజానికి ఒక జన్మ తపస్సుచాలదు. మాస్టరుగారు దయతలచి 12 సంవత్సరాలు ఈ జన్మలో సాధనచేస్తే సిద్ధిపొందినట్లే నన్నారు. అప్పటికి సాధన సంపూర్ణం అవుతుంది.అసలు రెండు సంవత్సరాలపాటు నియమ నిబంధనలతో, నిరాటంకంగా సాధనచేస్తే తప్ప యోగంలో ప్రవేశించినట్లుకాదు. అయిదేండ్లు సాధనచేస్తేతప్ప ఏర్పడదు స్టెబిలిటీ అంటే, హృదయం పవిత్రంకాదు, పదేండ్లు సాధన చేసినవారికిగానీ 'యోగి' అని చెప్పుకునే అర్హత ఉండదు. పదేళ్ల కఠోరసాధన తర్వాత, యోగిగా తలెత్తుకుని తిరగవచ్చు. మనం యోగం చేస్తున్నామని ధైర్యంగా చెప్పుకోవచ్చు.

'యోగ టీచ్–ప్రాణ ట్రీట్' అన్నది మన యోగంలో సూత్రం. అంటే యోగానుష్ఠానం వల్ల కలిగే ప్రాణశక్తితో చికిత్స చేయవచ్చు. యోగసాధన నేర్పమని, రోదసిలో అంతటా వ్యాపించివున్న ప్రాణశక్తి (వాయువు కాదు)ని గ్రహించి, దాని సహాయంతో మానవ దుర్గుణాలకు చికిత్స చేయమని ఒక అర్థం. ఆ ప్రాణశక్తిని గ్రహించడం అంత తేలికకాదు. పరిణతి చెందిన యోగికి తప్ప సామాన్యులకు ఆప్రాణధారను భరించే శక్తి ఉండదు. కనుక ముందు నిష్ఠగా యోగ సాధన చేయాలి, చైతన్యవంతులు కావాలి, దివ్యప్రజ్ఞను అందుకోవాలి. ఆ పైన ట్రీట్‌మెంట్.

'ట్రీట్' అనే పదానికి అర్థం రోగాలను ట్రీట్ చేయడం ఒక్కటేనని నేను అనుకోవడంలేదు. 'ట్రీట్‌మెంట్' అనే పదానికి అనేక అర్థాలున్నాయి. మాస్టరు గారు ఆ రోజుల్లో (1910–22 మధ్య) ట్రీట్‌మెంటు కొరకు నలుగురు మీడియమ్స్‌ను ఉపయోగించారు. 24 గంటలలో ఎవరు ఎప్పుడు వచ్చినా, వారు ట్రీట్ చేసి పంపేవారు. ఎంతో ప్రేమతో, దయతో చేస్తేగానీ ట్రీట్‌మెంట్ జరగదు.

అందరినీ సమదృష్టితో చూడాలి. అందరికీ యోగఫలం అందించాలన్న సహృదయత కావాలి. కారుణ్య దృష్టి, తారుణ్య హృదయంలేని వారు చికిత్స చేయడానికి అనర్హులు, మోక్షమే లేనప్పుడు, ఈ ప్రణాళిక ఎందుకు అనుకోవచ్చు. మనకు లాభంలేనప్పుడు ఎందుకీ ట్రీట్‌మెంట్స్? మనకోసం కాదు. స్వార్థంతోచేసే పని ఏదీ సత్ఫలితాలనివ్వదు. నిస్వార్థంతో చేసే పని యోగం క్రిందికి వస్తుంది.

మాస్టరుగారి సిద్ధాంతాల్ని ఇలా కొంత అవగాహన చేసుకున్నారని అనిపిస్తుంది మొదట్లో ఈ నూతన యోగాన్ని ఒక ప్రయోగంగా ప్రారంభించారు మాస్టరుగారు ప్రయోగం ఫలించేవరకు తగిన ప్రచారానికి అనుమతించలేదు అసలు ఈ యోగం గురించి ఎవరినీ చర్చించనిచ్చేవారు కారు. మాట్లాడనిచ్చే వారు కారు, వ్రాయనిచ్చేవారు కారు. చెప్పినట్లు సాధనచేయడం ఒక్కటే సాధకుల పని. ప్రయోగ ఫలితాలను మాస్టరుగారే రికార్డు చేసుకునేవారు గ్రహాలను సైతం అదుపులోకి తీసుకోవడం జరిగింది. యోగంలో పరాకాష్ఠకు చేరిన సమయంలో ఆ మహాశక్తిని పట్టుకొని భరించేశక్తి భౌతిక శరీరానికి లేక తాను శరీరాన్ని వదలి పెట్టారు. కనుక మాస్టరుగారు ఏది ఆశించారో ఆయన శిష్యులకే అంతు చిక్కలేదు.

మాస్టరుగారు లేరు అనే వారికి యోగంలేదు. మాస్టరుగారు భౌతిక శరీరంలో కనిపించకపోవచ్చు. కళ్లు మూసుకుంటే మాస్టరు గారి దివ్యరూపం సాక్షాత్కరిస్తుంది. ఆయన మనతో సంభాషిస్తారు. సలహాలిస్తారు. మనల్ని స్వయంగా నడిపిస్తారు. ఈ యోగంలో ప్రతిసాధకుని మాస్టరుగారే స్వయంగా నడిపిస్తారు. 'ఉపదేశం' యిచ్చేది గురువు అయినా, హృదయంలో దివ్యజ్యోతిని వెలిగించేది మాస్టరుగారే. వారి దివ్య దర్శనమే ప్రతిసాధకునకు ఒక నిదర్శనం.

మిగిలిన యోగాలలోవలె ఇందులో సంసారజీవితం నిషిద్ధం కాదు. సన్యాసం, బలవత్ బ్రహ్మచర్యం పనికిరావు. ప్రపంచాన్ని, సంసారాన్ని వదలి పారిపోనవసరంలేదు. లోకంలో వుంటూ, మామూలు జీవిత ధర్మాలు, గృహస్థాశ్రమ ధర్మాలు అన్నీ సక్రమంగా నిర్వర్తిస్తూ దివ్యజీవనం సాగించాలి. ఆనంద మయ జీవనం నెలకొల్పుకొనాలి. అందుకు యోగసాధన ఉపకరించాలి. ఉద్యోగ, వ్యాపార నిర్వహణచేస్తూ, ధార్మికజీవనం గడుపుతూ సత్యాన్ని ఆశ్రయించాలి. 'సత్యం'లోనె 'సత్యసంధత' లోనే ఆధ్యాత్మిక ప్రగతివుంది. ఈ నూతన యోగ లక్ష్యం అది.

యోగ సాధకులకు సత్యమే కరదీపిక. ఏది సత్యమో తన హృదయమే చెబుతుంది ప్రతివానికి. అసత్యానికి హృదయంలో తావులేదు. మన మనస్సు, వివేకం, చదువు మనల్ని మోసగించవచ్చుగానీ మన హృదయం, జ్ఞానం మోసం చేయవు. మనిషికి మనిషికీ మధ్య వున్న అంతరాలు మనం సృష్టించుకున్నవే తప్ప, భగవంతుడు సృష్టించినవి కావు.

మీరుగా ఆలోచించండి 21వ శతాబ్దంలోకి, అంటే నవ యుగంలోకి, సత్య యుగంలోకి అడుగు పెడుతున్న మనకు విశ్వదృక్పథం అలవడిందా! ముందు దాన్ని సాధించండి, దాని కోసం యోగ సాధన చేయండి.

మాస్టరుగారు ఆశించిన ప్రయోజనం ఏదో గుర్తించి ఆ వైపు పురోగమించండి. ఇది విశ్వయోగం- దీని లక్ష్యం విశ్వ శ్రేయస్సు, సత్య స్థాపన.. నీ-నా స్వార్థం కాదు. సంకల్పమే మనది, నడిపించేది గురుదేవులు— అని నమ్మాలి. ఈ యోగంలో మనకు సిద్ధించే శక్తులు ఏవిగానీ, అవి మన స్వార్థ ప్రయోజనం కోసం కాదు, కనుక వాటి అధికారులం మనం కాదు. 'కీ' మాస్టరు గారి చేతిలో వుంటుంది. ఆయన ఒక్కసారి అటు త్రిప్పితే అన్నీ ఆగిపోతాయి. మన ప్రయోజకత్వం ఏదీ మిగలదు అహంతో ఏది చేసినా అపజయం తప్పదు. స్వార్థంతో ఏది చేసినా నిరుత్సాహం తప్పదు, నిరాశ తప్పదు. మాస్టరుగారి అనుగ్రహంతో ఏర్పడిన శక్తులను, సిద్ధులను ఆయన సంకల్ప నిర్వహణకు, మానవ కల్యాణానికి ఉపయోగిస్తేనే ప్రయోజనం. అప్పుడే మనకూ విజయం. ఈ రహస్యం ఎవరూ

చెప్పనవసరం లేదు. మన హృదయమే చెబుతుంది. ఏ మహాత్ముని జీవిత చరిత్ర తిరగ వేసినా ఆసక్తం విదిత మవుతుంది.

కొత్త అనే సరికి ఈ రోజుల్లో ఆసక్తి. ఆ రోజుల్లో భయం. పాత రోజులలో సంప్రదాయం గడ్డ కట్టుకు పోయి వుండేది. ఆచార వ్యవహారాలు ఎక్కువ. కాస్త కొత్తదనాన్ని ధరించే వారు కారు. అలాటి రోజుల్లో మాస్టరు గారు 'నూతన యోగాన్ని' ప్రవేశ పెట్టారు. సంప్రదాయ వాదులు వ్యతిరేకిస్తారని తెలుసు. చదువుకున్నవారు, విప్లవ దృక్పథం కలవారు ఇదేదో చూద్దాం అని చేరారు తప్ప, దీనిపై విశ్వాసం ఉండి కాదు. అలాంటి వారే అతుక్కుపోయారు దీనికి. తరువాత మాస్టరు గారినే సాక్షాత్తు పరమాత్మ స్వరూపులుగా భావించి, పూజించారు. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి వంటి మహాపండితులు, శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ వంటి స్వాతంత్ర్య వీరులు, సంస్కర్తలు మాస్టరుగారి ప్రియశిష్యులైనారు.

యోగాన్ని శాస్త్రీయ దృక్పథంతో సైంటిఫిక్‌గా ఆలోచించడం ఈ 20వ శతాబ్దంలోనే జరిగింది. అరవిందులు జ్ఞానదృష్టితో చూస్తే, మాస్టరుగారు శాస్త్రీయ దృష్టితో చూచారు ఇరువురిదీ పారమార్థిక దృక్పథమే. సృష్టిలో జడ పదార్థాలు, చేతనలు వున్నాయి. జీవ పదార్థాలు, నిర్జీవపదార్థాలు ఉన్నవి. అన్నింటికి మూలం అణువు. అణువునుండి బ్రహ్మాండం వరకూ అంతా ఈశ్వర ప్రజ్ఞ, అంతా చైతన్యమే. అంతా పరిణామం చెందుతున్నదే. ఈ సృష్టి పరిణామంలో మానవునిది నాల్గవదశ. కుండలిని సైతం నాల్గవ విభాగంలోనే పనిచేస్తున్నది. వెనకటి వారు చెప్పినట్లు కుండలినికి బుసలు కొట్టే స్వభావం లేదు. అది చైతన్యంగా మారిపోయింది. అది సర్పం వలె లేదు. మనిషికే మనస్సు వున్నది. ఆత్మ వున్నది. మిగిలిన జీవులకు ఆత్మ లేదు కనుక, ఆధ్యాత్మికాభివృద్ధికి అవకాశం లేదు. మనస్సు ఉన్నది కనుకనే 'మనిషికి' అహం ఏర్పడ్డది. అహంతోనే అజ్ఞానం ఏర్పడ్డది. సృష్టిని గురించిన ఆలోచన ఏర్పడ్డది. కనుక పరిణామానికి పునాది మనిషి మనస్సు. 'అహం' వల్లనే నేను, నాది అన్న తత్వం ఏర్పడుతున్నది. అహాన్ని దాటి పోతే ఆత్మ జిజ్ఞాస ఏర్పడుతుంది. 'అహం' వదలి, 'బినెస్'ను పట్టుకుంటే తప్ప యోగసాధన కుదరదు. "కోహం?" నేనెవరు? అని ప్రశ్నించుకోవడం జ్ఞానం! 'అహం బ్రహ్మ' అని గ్రహించడం ప్రజ్ఞానం.. ఆ వైపుగా ఎదగడం యోగం.

గురుస్సాక్షాత్ పరబ్రహ్మ

మన శరీరంలో అయిదు ప్లేన్స్ (కోశాలు) ఉన్నాయి. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశాలు. వీటినే ఫిజికల్, యాస్ట్రల్, మెంటల్, బౌద్ధిక, నిర్వాణ ప్రహరాలు అనవచ్చు. నిర్వాణ మండలం జీవుని ఆవాసం. ఆతర్వాతవి పరనిర్వాణ, మహాపరనిర్వాణ మండలాలు, మొత్తం ఏడు మండలాలు. ఆవరణలు. ఆ ఏడు మండలాలలోనే జగత్తు విస్తరించి వుంటుంది. అటువంటి జగత్తులు, సృష్టిలో అసంఖ్యాకంగా ఉన్నాయి. సప్తావరణ వేష్టితమైన మన జగత్తులో మధ్యది, నాల్గవది అయిన బుద్ధి మండలం మానవునిది. ఈ బుద్ధి ప్రహరంలో క్రింద మూడు, పైన మూడు అంతస్తులున్నాయి. పై మూడు మండలాలనుండి వచ్చే దివ్య సంకేతాలను, సందేశాలను బుద్ధి వికాసంతో మనిషి గ్రహించ గలుగుతున్నాడు. ఈ బుద్ధి మండలం దాటితే తప్ప మనిషికి ఆధ్యాత్మిక వికాసం కలగదు. సత్యం కనువిప్పు కలిగించదు. పై మండలాలు ఒక్కొక్కటిగా చేరుకోవాలి.

మాస్టరుగారు కొన్ని కొత్త మాటల్ని ఉపయోగించారు. వారుపయోగించిన ఆది, ఆది బ్రహ్మం' అనే పదాల అర్థాన్ని ముందుగా తెలుసుకోవాలి. ఆది అంటే ఆరిజన్. అంటే సృష్టికి ముందర స్థితి. అది సృష్టికి చాలా ముందున్న పరిస్థితి. అది అంతటా పరచుకున్న చైతన్యం. ఆ అగోచర మహాశక్తిని, అంతటా పరచుకున్న దాన్ని, అనంతమైన దాన్ని, అనంతమైన దాన్ని 'బ్రహ్మం' అంటారు. బ్రహ్మం అంటే ఒక రూపం, ఆకారం లేని విశ్వ వ్యాపక శక్తి, చైతన్యం, తేజస్సు. ఆ చైతన్యంలో కలిగిన ప్రేరణ, సృష్టి వాంఛ 'శక్తి' అయింది. ఆ శక్తినే ఈశ్వరత్వం అంటారు.. ఈశ్వరత్వం.. శివుడు కాదు. అది క్రియాశక్తి, ఉన్మీలనం అంటే మౌలికమైన క్రియేటివ్ ఫోర్స్. ఒక్క క్రియేటివ్ ఫోర్స్ మూడు భాగాలై సృష్టి, స్థితి, లయ బాధ్యతలు వహించాయి.. ఇతరత్రా చిల్లర శక్తులన్నీ దేవుళ్ళు, దేవతలు అయ్యాయి. అఖండశక్తి ఈశ్వరుడు, ఇదీ సృష్టికి 'ఆది' స్థితి.

అసలు జీవి ఎలా తయారైందీ ఆలోచిద్దాం. రోదసి నిండుగా వ్యాపించిన 'ప్రాణం' శక్తిగా మారినప్పుడు సృష్టిసంకల్పం ఏర్పడ్డది. ఆ సంకల్పం విస్ఫులింగాలై శూన్యంలో విరజిమ్మ బడినపుడు వెలుగు కణాలు ఏర్పడ్డాయి. అలా ఏర్పడిన కోట్ల మెరుపులే జీవాలు. ఆరంభంలో జీవులకు ప్రజ్ఞ లేదు, జ్ఞానంలేదు.

ఒక్కొక్క జన్మ ఎత్తిన కొలదీ పరిణామంలో బుద్ధి,జ్ఞానం, ప్రజ్ఞ ఏర్పడసాగాయి. ఒక జన్మ సంస్కారం. మరొక జన్మకు అందివస్తుంది. అవ్యక్తమే సత్, చిత్, ఆనంద స్థితిని పొందుతుంది. ఆ మూడింటి ప్రకాశం వల్లనే ఆత్మకు వికాసం ఏర్పడుతున్నది. సృష్టినే ఉనికి—ఎగ్జిస్టెన్సు అనవచ్చు 'ఆది'సంకల్పం 'సృష్టి' చైతన్యం కలిసినప్పుడు 'ఉనికి'ఏర్పడుతుంది. సంకల్పమే లేకపోతే సృష్టి లేనట్లే. మనలో సంకల్పమే లేకపోతే యోగం లేదు. అంటే సృష్టికి వికాసం, పరిణామం లేదు. సృష్టి వికాసానికి యోగమే మూలహేతువు. ఏ యుగంలో ఎవరు యోగం చేసినా, అది పరిణామానికి సహకరిస్తూ వస్తున్నది. యోగులు లేని నేలలు బీళ్ళు. ఆ దేశాలు ఎడారులు. ప్రకృతి-పురుష విలాసాన్ని, విన్యాసాన్ని ఏల అంటారు. ఈ శరీరాన్ని క్షేత్రమనీ, ఆత్మను క్షేత్రజ్ఞుడనీ పిలుస్తారు. అదే విస్తృతార్థంలో మూలపురుషుడు, మూలప్రకృతి. పరబ్రహ్మాన్ని, పురుష, ప్రకృతి శక్తులను అ+ ఉ+ మ్= ఓంగా చిత్రించారు. ఓంకార ప్రణవమే సృష్టి మూలమని గ్రహించవచ్చు. ప్రణవంతోనే బ్రహ్మాన్ని చేరవచ్చు నన్న సూత్రం అదే. ప్రణవమే పరబ్రహ్మం. మనలో పరమాణు రూపంలో వున్న కుండలినీ శక్తిని జాగృతం చేయగలిగితే బ్రహ్మాన్ని తెలుసుకోవచ్చు. భృక్తరహితం చేయడమే మాస్టరుగారి తారక రాజయోగ పరమావధి

కుండలినీ శక్తి సర్పాకృతిలో మూడున్నర చుట్లు చుట్టుకుని మూలాధారంలో వుంటుందనీ, దానిని తపశ్శక్తితో నిద్రలేపి, బ్రహ్మస్థానానికి చేర్చడమే లక్ష్యం అంటారు. ఇప్పుడు ఆ సర్పాన్ని నిద్ర లేపవలసిన పనిలేదు. ఆ శక్తి సహజంగానే నాల్గవ మండలమైన(అనాహతం) హృదయాన్ని చేరేవుంది. అక్కడి నుండి పైకి వెళ్లాలే గానీ, క్రిందికి కాదు. అలా పై మండలాలకు వెళ్లడానికి సూటి మార్గమే మాస్టరుగారి డైరెక్టులైన్.

ఇంత క్రితమే ఎక్జిస్టెన్స్-అంటే ఉనికి గురించి ముచ్చటిస్తూ ఆ సృష్టి ప్రకృతి—పురుషుల విన్యాస మని చెప్పుకున్నాం. వాటి ప్రతినిధులే స్త్రీ పురుషులు. ప్రతి పురుషునిలోనూ శక్తి అంశ, ప్రతి స్త్రీలోను పురుషాంశ ఉంటాయి. ఉభయులలోని రెండు అంశలు ఏకం కావడమే యోగం, యోగానికి సంపూర్ణత. అది సంయోగంతోనే గానీ, బ్రహ్మచర్యంతో సిద్ధించదు. సన్యసించడంతో అసలు కాదు. పూర్ణ యోగానికి, స్త్రీ పురుషుల సంయుక్త సాధనం అవసరం. అందుకే యోగాన్ని స్త్రీలు పురుషులు కలిసి చేయాలన్నారు. సతీ పతులు ఇద్దరిలో వున్నది

ఒకే ఆత్మ. అదే ఆత్మ సంయోగం. చేసుకున్న భార్యే కానవసరం లేదు. కొన్ని పక్షి ఆత్మ బాంధవ్యం వుంటుంది. శ్రీ అరవిందులు మదర్ ఏకాత్మలే.

మాస్టరు గారు అమరత్వం ప్రసాదిస్తా మన్నది జీవికి అమృతత్వం అందిస్తామన్నది ఆత్మకు. అవును జీవి వేరు, ఆత్మ వేరు. ఆత్మ బ్రహ్మం కావాలి. జీవికి యోగార్హత కలిగినప్పుడే ఉపదేశం యివ్వడం జరుగుతుంది. ఆ సంకల్పం, ప్రేరణ మాస్టరు గారే కలిగిస్తారు.

మనమంతా బ్రహ్మం నుండి వచ్చిన వాళ్లమే. కానీ మానవాత్మలన్నీ బ్రహ్మంతో సమానం కాదు. మన ప్రయత్నాల్ని దేవతలు, దేవుళ్లు ప్రోత్స హించరు. పైగా అడ్డు పడుతుంటారు. మన అవసరాలు గుర్తించి, ఏవేవో వరాలిచ్చి మనల్ని కట్ట వేస్తారు. పరబ్రహ్మం వేపుగా జీవుడు పయనిస్తే తమను మించి పోతారని దేవతల ఉక్రోషం. అందుకని ముందుకు పోకుండా అడ్డుపడు తుంటారు మనం డైరెక్టుగా అయిదవదైన సచ్చిదానంద మండలాన్ని చేరుకోవాలి. ఆ తర్వాత, నిర్వాణ, పర నిర్వాణ, మహాపర నిర్వాణ మండలాలున్నాయి.

నశింపు లేనిది, శాశ్వతమైనది ఆత్మ. అది అ + ప్రాకృతికం. మన శరీరాలు ఆత్మేతరమైన ప్రకృతి నుండి అరువుతెచ్చుకున్నవి. ఆత్మ శరీరం ఒక్కటే దివ్యమైనది, అనశ్వరమైనది. అది అశరీరి. అది బ్రహ్మ పదార్థంతో ఏర్పడుతుంది. అందుకే ఈ యోగాన్ని బ్రహ్మ యోగం అన్నారు. ఈ యోగంలో ప్రవేశించిన వారు ఇతర శక్తుల్ని ఆశ్రయించకుండా స్వతంత్రంగా, స్వయంప్రజ్ఞతో పరాశక్తులు పొందగలరు. మాస్టరుగారే ఆ శక్తుల్ని అనుగ్రహిస్తారు. అందుకే, యోగ సాధన చేసేవారు, ముందుగా సద్గురువును ఆశ్రయించాలి. 'గురువు' అంటే మాస్టరుగారి ప్రజ్ఞను అందుకున్న వారు. ఆ ప్రజ్ఞతో యితరుల్ని యోగంతో ప్రభావితం చేయగలరు గురువు అంటే మాస్టరు గారి ప్రతినిధి. గురుస్సాక్షాత్ పరబ్రహ్మ. గురువును సాక్షాత్ పరబ్రహ్మ స్వరూపులుగా భావించి, యోగసాధన చేసినప్పుడే మాస్టరు గారి యోగం అర్థ మవుతుంది. యోగంలో పూర్ణ సిద్ధి కలుగుతుంది.

# NRBV లేఖ

సి.వి.వి
నమస్కారము

34. కె. వఝ్యా. స్ట్రీట్
కుంభకోణము

మీరు టైపు చేసి పంపిన జాబుకు బదులు ఈ జనరల్ కాల్‌లో సమక్షమున తెలుపుదును. దీనితో ఇంగ్లీషు ఇన్విటేషన్‌లు 4 పంపినాను. మీరొకటి, ఇప్పుడు అప్పారావుగారు ఉన్న అడ్రసు తెలియలేదు కనుక వారికి నేను పంపలేదు. ఈ వివరము తెలిపి వారికి మీరే ఒక ఇన్విటేషన్ పంపండి. మీ తమ్ములు ముక్త్యాల, బెజవాడలలో నున్నవారికిని ఇన్విటేషన్‌లు పంపితిని. వారు అడ్రసు మారి ఉంటే మీరు వారికి కూడా పంపుటకు రెండు ఉంచినాను. అందరు 25 తేదీకే యిక్కడికి వచ్చునట్లు వ్రాసిరి. అనురాధ మొదలు ధనిష్ఠ తుది దాక ఈ యోగమే ఆరంభమయిన మేమాసమున ఈ మాదిరిగా సమకూడుట మన డెవలప్‌మెంటు ననుసరించియే. అందును ఈ యేడాధారముల కార్యము నడచుచున్న ఈ కాలమున మిత్రులమగు మనము తేరుటకు రొంబ ముఖ్యమును, ఆవశ్యకమును, నిండిన కాలమును అగును. మాస్టరుకు మిత్రులమయి యుండదగిన మనము ఈ యోగస్కూలు తిరిగి ఈ స్థలమున నేర్పడిన తర్వాత, ఈ కాల్ ఒక పెద్ద ఆపర్చ్యూనిటి. ఇది మీరు స్నేహితులకు ఇతరులకు తెలుప వచ్చును. 26తే అనూరాధ వచ్చుటచేత నాటి సాయంకాలముననే మిమ్ము చూచుటకు ఆశపడు చున్నాము.

22నే ఆవిట్టం ముగియు దాక ఇక్కడ ఉండుటయే యోగపు రహస్యము. మీరే లేదికి వచ్చేది తెలియ ఎదురు చూచుచుందును.

(*sd*) *N.R.B.V*

(శ్రీ ప్రభాకరులు (చూ. లేఖ 18/4/45నాడు) శ్రీ ***NRBV*** గారికి తమ ఉపన్యాస పాఠమును జతచేసి పంపుతూ వ్రాసిన లేఖకు ఇది సమాధానము తమిళ మున గల లేఖకిది తెలుగుసేత. యోగమిత్రులు సమావేశ మగుటకు కుంభకోణ మున యోగాస్కూలు నందు తిరిగి వసతి యేర్పడుట ఇందలి ముఖ్య విషయము ఆనాడు *NRBV* గారు మిత్రుల సహకారముతో ఈ విషయమున గావించిన యత్నమును బోలినదే ఇటీవల శ్రీ ప్రభాకరుల శిష్యులగు శ్రీ శ్రీనివాసాచార్యులు గారు యోగమిత్రమండలి సహకారమున కుంభకోణములో యోగకేంద్రమును స్థాపించుటకై చేసిన ప్రయత్నమును— సం॥)

# నాడీకారుడు చదివిన కొన్ని పాటలకు సారార్థము

1. ఈ విధముగా మర్చరీ, ఆరీ, హోలర్, ఆర్థర్, టెండర్ మొదలయిన కోర్సులు సరిగా చేసినవారు ఆ యోగము ననుభవించినవారు సింపుల్ (ఇది ఒక కోర్సు కూడను)గా యజమానుని చూడనగును. ఎఱుగుము వశిష్ఠా! ఇట్లుగా ఉపక్రమించి అంచుచేరి చూచి కూడ విడిచి పెట్టిన వారికి బుద్ధి చెప్పుటకు కల్గుటకు కడపట వారు పడబోవు అవస్థను గూర్చి చెప్పినారు. విడిచి పెట్టిన సర్వసాధకముల శక్తికి కడపట ఒక్కసారి అనుభవింప వలసి వచ్చేటప్పటికి శరీరము తాళలేక బాధపడు కాలమున యముడు (మృత్యువు) ఆసన్నమైనట్టు గగ్గోలు ఏర్పడును. ఆ స్థితికి భయపడి బంధువర్గము సక్రమముగా సాధకము చేయుచు స్వస్థతతో ఉన్న శిష్యుల గూర్చి వెద కుదురు. ఇది యొక వింత.

2. వింత అని చెప్పితిరే. విచారించి చూచితిని. మీరు చెప్పిన విధమెల్లను గమనింపగా మీకు హృదయమున కొంచెమేని కరుణ లేనట్లున్నది. చావు సిద్ధమై యున్న స్థితికా మీరు వింత అనెదరు? అక్కడ గుమిగూడిన బంధు వర్గము 'భయపడవద్దు' అని చెప్పినంత మాత్రాన శ్రీ సి.వి.వి శక్తి యని యెన్నుదురా? అట్లు చెప్పుటలో కరుణ కలదా? వివరించి చెప్పుము.

3. ఆ శిష్యుడు భయపడవలదని చెప్పుటకు పూర్వమే బంధువు లందఱు బ్రతికించుటకు వైద్యుని పిలుతురు. ఆతడు సత్యనాడి ఆడుట లేదు అని భయపెట్టిచి ఈ మృత్యువు నాపుటకు మందొక్కటి ఉన్నది దానికై పౌన్నులు (15రూ) కావలె నను. మారాడక ఆ సొమ్ము చేతపెట్టి బ్రతి కించండి బాబూ అని బతిమాలు కొంటారు.

4. ఇట్లు చెప్పగానే అతడు ఆ మాటవిని నిమిషములో వస్తానని.... (కాగితము చినిగినది) అప్పుడా రోగి మూలమున స్వాస్థ్యము చెంది.... వింత చెందుచుండగా ఆతడు లేచును. అది విని ఆ వైద్యుడు.... కొని వచ్చుటకని చెప్పుచు తీసికొని వచ్చును. అటువిని ఆ బంధువులు ప్రశంసింతురు. అది విను.

5. అయ్యా ఈ వైద్యుడు మిక్కిలి మంచి వాడు అంటారు. సులభుడు అంటారు. హస్తవాసి గలవాడు అంటారు. ఈ వైద్యుడు వచ్చిన చోట వ్యాధి కొంచెము కూడ నిలుపదు అంటారు. ఇది వినుచు చూచుచు ఉన్న ఆ సాధకుడు వీళ్ళకు బుద్ధి చెప్పుటకు ఆతని ప్రాణమును తనలోనికి లాగి కొనును.

6. ఇట్లు ప్రాణము తన స్వాధీనములోనికి తీసికొను కాలము ఆ వైద్యుడు మందిచ్చిన పిదపనే అగును. బంధువులు రోదనము చేస్తారు. ఆ సాధకుడు ఆగండి ఆగండి అని వాళ్లు తృణీకరించు చుండగా ఓర్చి తిన్నగా వివరించి బుద్ధి చెప్పి 'క్లీ' అయిన ఆ పరబ్రహ్మము నామము వలన బ్రదికింపగా, సాష్టాంగముగా వారు వందనము చేయుదురు.

7. ఈ కథ ఆ ఊళ్లోనూ పక్క ఊళ్ళల్లోను వ్యాపించును. వారందరూ చూడ వత్తురు. ఇట్లు తీర్థ ప్రజగా వారు చూడవచ్చు నప్పటికి, జరుగు వింతను పూర్వాషాఢ వెళ్ళిన తర్వాత ఉత్తరాషాఢ నాడు చెప్పుతాను విను.

ఇది ఒకరి జాతకములోనిది. ఈలాటి వింతలు అనేకులకు జరుగును. ఇట్టి వాని చేతనే శిష్యుల మహనీయత ముందు ప్రవ్యక్తమగును....

(వే.ప్ర. 8.3.1926)

# మాస్టర్‌యోగ సారాంశము

- వారణాసి సుబ్రహ్మణ్యం

ఈ సి.వి.వి యోగాన్ని గురించి చాలామంది తెలుసుకోవాలని ఉత్సాహ పడుతున్నట్లు వింటున్నాను. అసలు యోగము అంటే అందరికీ తెలిసినటువంటి విషయమే. అయితే ఇందులో ఉన్నటువంటి ప్రత్యేకత ఏమిటంటే, కఠోపని షత్తులో నచికేతోపాఖ్యానంలో నచికేతుడు యముణ్ణి అడిగిన ప్రశ్నకి సమాధాన మిచ్చాడు. అంటే మృత్యుంజయత్వానికి యోగం ఏవిధంగా సహాయపడుతుంది అని. మృత్యుంజయత్వము అంటే మృత్యువుని జయించడము అని మామూలు అర్థం. ఇలా అని చెప్పుకుంటే ఈ శరీరం ఏమవుతుందీ అన్నటువంటి ప్రశ్న ఉంటుంది. శరీరం వేరు ఆత్మ వేరు అని ఒక సిద్ధాంతం. శరీరమేమో శాశ్వత మైనటువంటిది కాదు, ఆత్మ శాశ్వతమైనటువంటిది అని ఆ సిద్ధాంతం యొక్క వాదం. అయితే ఈ శరీరం — "శరీరమాద్యంఖలు ధర్మసాధనమ్" అన్ని ధర్మాలు సాధించడానికి శరీరం చాలా ముఖ్యం అని ఆర్యోక్తి. అటువంటి శరీరం శాశ్వతంకాకుండా ఆత్మే గనుక శాశ్వతమైనట్లైతే ఈ శరీరం కోసం అసలు మనిషి ఎందుకు బాధపడాలి అనేట్లైతే కేవలమున్నూ కర్మ అనుభవించడానికి ఈ శరీరాన్ని ఇలా సృష్టించాడు భగవంతుడు, అందుచేత ఆ కర్మని ఈ భూలోకంలో అనుభవించి ఈ శరీరాన్ని విడిచిపెడితే సరిపోతుంది — అంటూ చాలాకాలంగా నమ్ముతూవచ్చారు. ఇలా అయినట్లైతే ఇక సాధిస్తున్నది ఏమిటి మనిషి ? ఈ భూప్రపంచంలో పుట్టింది కేవలమున్నూ ఏదో బాధలుపడుతూ వుండి, సంచితంకాని, ప్రారబ్ధంగాని, ఆగామికాని, ఈ మూడురకాల కర్మల్లోనూ ఏదో ఒక కర్మని అనుభవిస్తూ లేదా, ఈ మూడు రకాల కర్మల్నికూడా అనుభ విస్తూ దానికోసం మాత్రమే ఈ శరీరాన్ని ఉపయోగించడమేనా— కేవలం ఆత్మ కోసమే పుట్టిందా అసలు మానవుడన్నటువంటి ఈ సంస్థ అన్నటువంటి ప్రశ్న

వస్తుంది. అలాకాదు. ఈ శరీరం చాలా ముఖ్యమైనటువంటిది. ఈ శరీరంలో ఆత్మ అన్నటువంటిది భగవంతుడికి దివ్యత్వానికి ప్రతిబింబంగా ఉంటుంది. ఈ ఆత్మశక్తిని ప్రకోపింపచేయడానికి శరీరంలోనే కొన్ని కొన్ని శక్తులున్నవి. ఆ శక్తుల్ని కనుక సమన్వయం చేసుకొన్నట్లయితే, ఒక యోగశక్తి వల్ల ఆ శక్తిని గనుక ప్రకోపింపజేసుకోదలచినట్లైతే ఈ శరీరం శాశ్వత మవుతుంది అన్నటు వంటిదే శ్రీ సి.వి.వి. చెప్పినటువంటిది. ఇలాటిది ఇదివరకు కొందరు చెప్పకపో లేదు. రకరకాల వాదాలున్నవి. పుదుచ్చేరిలో అరవింద మహర్షి తన ఎసెంట్ ఆఫ్ మేన్ హెడ్ అండ్ ది డెసెంట్ ఆఫ్ గాడ్ అన్న విషయాన్ని *Life Devine* అన్న ఉత్కృష్ట గ్రంథంలో నిర్వచించారు. అయితే అది ఎంతమందికి అర్థ మయింది అన్నటువంటిది అర్థమయిందని చెప్పుకున్నటువంటివారు వివరించవలసి నటువంటి విషయం. అన్ని యోగాలకిమల్లే కాదు ఈ యోగం. పతంజలి చెప్పినదాని ప్రకారం, యమ, నియమ, ప్రాణాయామ, ప్రత్యాహార, ఆసన, ధ్యాన, ధారణ, సమాధి—ఇత్యాదయః—ఈవిధమైనటువంటి మెట్లన్నీ దాటితేతప్ప యోగ మన్నటువంటిది సిద్ధించదు అని. కొంతమందేమోను కేవలం కొన్ని బీజాక్షరా లుచ్చరిస్తేచాలన్నారు. మరికొందరు తంత్రాన్ని బోధించారు. వేరు కొందరు పూజల్ని నిర్దేశించారు. వివిధ విధాలుగా ఉన్నది ఈవిషయం. అయితే ఏ గురువుగాని ఇంతమటుకున్నూ కేవలం నా పేరును మీరు స్మరించినంతమాత్రం చేత, నా బీజాక్షరాలను మీరు ఉచ్చరించినంతమాత్రంచేత, మీకు యోగం సిద్ధి స్తుంది, నేను జన్మ జన్మలుగా ఎంతో తపస్సు చేసి సంపాదించినటువంటి శక్తిని మీకు కేవలమున్నూ నామమాత్రోచ్చారణ చేతనే పొందగలిగేటట్లు మిమ్మ నేను కటాక్షిస్తున్నాను అని ఏ గురువూ కూడా ఎప్పుడూ – న భూతో న భవిష్యతి చెప్పినటువంటివారు లేరు. అలా చెప్పినటువంటివారు ఒక్క సి.వి.వి. ఒక్కరే. అందుచేత ఈ శరీరాన్ని శాశ్వతంచేయడానికి ఈ భూలోకంలోనే ఈ శరీరంలో ఉన్నటువంటి రుగ్మత లన్నింటిని పోగొట్టుకోడానికి దివ్యత్వానికి దీన్ని తగినటు వంటి ఆలయంగా చేసుకోవటానికి, ఆ సంకల్పంతో వారి నామాన్ని ఉచ్చరిస్తూ దినము ఉదయము సాయంత్రము 6 గం॥ల ఆ సమయంలో ప్రార్థన చేస్తూ ఉంటారు. ఈ విషయంలో ఆయన అనేకమందికి ముందు ఉపదేశం ఇచ్చారు. ఆ యిచ్చినటువంటి వారిలో ప్రముఖుల్లో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగా రొకరు. తక్కిన శిష్యులకున్నూ ప్రభాకరశాస్త్రిగారికిన్నీ ఒక తేడా ఉంటూ ఉండేది.

శరీరం శాశ్వతం చెయ్యాలనికదా మతం. అటువంటప్పుడు శరీరానికి వచ్చేటటు వంటి రుగ్మతలు అవీ పోగొట్టడానికి ఈ యోగాన్ని ఉపయోగించనక్కరలేదా? అన్నటువంటి ప్రశ్న వారికి పుట్టివుంటుంది. అయితే ఒక మతం వుంటూ వుండేది—తపస్సు వల్ల శక్తివస్తుందనిన్నీ ఆ శక్తిని దుర్వినియోగం చెయ్యకూడ దనిన్నీ దుర్వినియోగం చెయ్యడమూ అంటే కర్మభూతములైనటువంటి ఇతరుల శరీరముల యొక్క రుగ్మతను గనుక ట్రీట్మెంట్ అన్నటువంటి పద్ధతి ద్వారా ఎవరైనాగనుక మార్చినట్లైతే ఆ కర్మ ఎవరు ట్రీట్ చేస్తున్నారో వారికి చుట్టు కుంటుందేమో— ఇట్లా అయినట్లైతే ఈ తపశ్శక్తిని వేస్ట్ చేస్తున్నట్లుకాదా అన్నటు వంటి ఒక మతం చాలామందికి వుంటూ వుండేది. ఇది సరికాదు. ఆవిధంగా శరీరం త్యాగమయిపోయినప్పటికి కూడా మంచిదే అనిచెప్పి ప్రభాకరశాస్త్రిగారి మతం. వారు ఆ విషయంలో చాలా కృషి చేసి ఒక పరాకాష్ఠకి వెళ్ళినటువంటి వారు. చాలా ముఖ్యులు. తక్కిన వారికి అది అబ్బలేదు. అబ్బలేదు అని ఎందుకన్నానంటే - దేనికైనా యోగ్యత వుండాలి. ఇతరుల కర్మను తన మీదికి వేసుకోవడము అన్నటువంటి విషయం సామాన్యమైనదికాదు. దానికి ముందు జన్మజన్మతః అసలు ఈ శరీరానికి ఒక యోగ్యత ఏర్పడి వుండవలె. అప్పుడుగాని ఆ అర్హతరాదు ఆ అర్హత యోగ్యత ఆయనకి వుండబట్టే అది సిద్ధించింది. తక్కిన వారికి కుదరలేదు. అందుచేత ఇప్పుడు ఆయన ద్వారా ఇనిషియేట్ అయి ఈ ఉపదేశంలో వున్నట్టివారందరూ కూడా తమ మిత్రులకి, ఆప్తులకి, బంధువులకి ఏవిధమైనటువంటి రుగ్మతలు వచ్చినా-తల నెప్పి నుంచి చాలా సామాన్యమైనటువంటి తేలు కుట్టడము, పాము కరవడము వంటి విషయాల నుంచి టి.బి., లెప్రసీ, కేన్సర్ మొదలైన దారుణ వ్యాధుల నివారణవరకున్నూ కూడా కేవలము ప్రార్థనతోనే అంతా కూడా ఈ రుగ్మతలన్నీ పోగొట్టుకోగల మన్నటువంటి నమ్మకంతో ఉంటూ ఉన్నారు. ఆ బృందంలోనివారే ఇప్పుడు ఇట్లా ఉంటూ ఉన్నారు. ఇంతకన్నా ఈ విషయం విపరించటానికి నామట్టుకు నాకు ఏమీ శక్తి చాలదు.

[కీ॥శే॥ వారణాసి సుబ్రహ్మణ్యంగారు మాస్టర్ యోగాన్ని గూర్చి ఒకనాటి యోగసమావేశంలో చేసిన ప్రసంగ పాఠమిది. వారి జ్ఞాపకార్థం మిగిలినవాటిల్లో మాకడనున్న ఆడియో టేపు నుండి గ్రహించినది. —సం॥]

# ప్రజ్ఞా ప్రభాకరము

-కొత్త రామకోటయ్య

(ఫిబ్రవరి - '86 సంచిక తరువాయి)

అప్పుడు *K. G. H* లో ప్రార్థనకు వచ్చే డాక్టరులు వారి శరీర స్థితి మానసిక స్థితి తమతమ శరీరములు నడుచు తీరుపై వారి యభిప్రాయములు మనము గమనించ దగినవి. ఆ వచ్చిన డాక్టరు లందరూ చాల సన్నగా మరీ నాజూకుగా నున్నారు. ఒక డాక్టరు మాత్రము పుష్టిగా ఉన్నాడు. ఆ డాక్టరును చూడగానే నాకెంతో సంతోషము గలిగినది. డాక్టరన్న వాడంత మాత్రము నిండు కుండలా యుండ వలయును. రోగులకు మంచి ధైర్యమును ఇచ్చే, మంచి విగ్రహముగా నుండుట మంచిదనుకొంటిని, గాని అందుకు విరుద్ధముగా నా డాక్టరభిప్రాయ పడుచుండెను. తానప్పటికే చాలా లావుగా నున్నానని వారిబెంగ. లావెక్కువయితే రక్తపుపోటువస్తుందని, షుగరు కంప్లైంటు వస్తుంది అని వారిక్కి చాలా భయముగా నున్నది. అన్నము తగ్గించిరి. ఇతర ఆహారమునూ చాలా తగ్గించివేసిరి. సగమాకలితో, సగము తిండితో యెండుకట్టెలుగా వడి యాలులా కావాలని వారి తాపత్రయము. భయమున్నూ. తన శరీరము చాలా లావయితే తనకూ మధుమేహము రావచ్చుననే భయ మొకటి వారినావ రించెను. వారు సంపన్నులయి యుండియున్నూ భోజనాదికము అర్థభాగముగా గడపుకొను చుండిరి. ఇది యంతయు వారి చదువు వలన వారు తెచ్చు కొనిన తిప్పలు. మా గురువుగారు శ్రీ శాస్త్రిగారు చాలా లావుగా ఉండేవారు. వారు చాలా రుచిగా నిండుగా భోజనాదికములు నిర్వర్తించేవారు. వారిని దర్శించి నంతనే ఒక హాయి, ఒక నిండుతనము. మనకేమి యన్నధీమా మనకూ సంక్రమించే లాగున మెరసి పోయేవారు. వారికిలాటి సందేహాలెప్పుడూ కలిగేవి కావు.

ఈ డాక్టరుగారి కింకొక భయమున్నది. రక్తపుపోటుగాని, మధుమేహము గాని వస్తే ఇక నయముగావు. కాబట్టి అట్టి లోపము (రోగములు) రాకుండానే చూచుకోవాలి. ముందుగనే ఏకాదశి వ్రతాలు చేయాలి. ద్వాదశి పారాయణములు పనికిరావు అంటున్నారు. నేను వారికి కొంత ధైర్యము గూర్ప యత్నించితిని. ఇలా వారా వ్యాధులు తమకు వసాయేమోనని సదా చింతించుట వలన చాలా చెరుపు వచ్చును. రోగ చింతనము చాలా యనర్థక మయినది. భగవంతుని గురించిన చింతనము సదా కల్యాణ ప్రదమైనది. మీరటుల చేయుడు అని వారికి చెప్పి చూచితిని. వారెంతవరకూ దాని కనుకూలింతురో చూడవలసి యున్నది. ఇది గురువుగారు చాల ప్రధానమగు సాధనా విశేషముగా భావించిరి. వారి ఓమ్యులక్షి విధానమును చక్కగా బోధించిరి.

నేను శ్రీవారిని దర్శించిన నపుడు నాకు మొట్టమొదటి పాఠమిదియే.

శ్రీవారిలా శలవిచ్చిరి: "నీవు రేపు ఉదయం ప్రార్థనకు వచ్చేటప్పుడు, బాగా ఆహారము తీసుకొని కాఫీ త్రాగి రమ్ము. నీకు బాగా సరిపడక వికటించే వికటించే పదార్థమునే నిండుగా తిని ప్రార్థనకు రమ్ము" అని. ఆ మాట నాకర్థము కాలేదు. నేను వినుట పొరపాటేమో ననుకొంటిని. సాధారణముగా ఎంతటి పెద్ద డాక్టరు కూడా ఈ మాటలనజాలడు. గురువులుగా చెలామణీ అయ్యే సామాన్యుల గురువు లెవరూ ఈ మాటల ననజాలరు. మహాయోగులు, సిద్ధపురుషులు మాత్రమే యిలా అనగలరు. అలా చేసి చూపించగలరు. నా భావమును గ్రహించి—

శాస్త్రిగారు : నీ శరీరము చక్కగా నడచును. గాన నాకు భయమేటికి. నీకింక యే వస్తువు వికటించదు. అందరితోపాటు ఆహారపదార్థములన్నియు సంతుష్టిగా భుజింపుము. వెరువకుము. శ్రీ మాష్టరు సి.వి.వి. గారిని గూర్చి చింతన చేయుచుండుము. నీ శరీరమును గురించిగాని, నీవు భుజించిన యాహారాదికములను గురించిగాని నీవిక యెప్పుడూ చింతించరాదు. చిత్తమీశ్వర చింతన యందు నిలుపుము. నీవు తీసుకున్న యాహారము నీకొరకు మాత్రమే కాదు. నీ ప్రక్క వారి కొరకున్నూ. వారికి నీ యాహారము సద్గయి కావలయును. పుడ్డు సద్గయి యిత

టిం కందించవలయును. వృద్ధిగాదు. నీలోని గుడ్డు : అనగా సారభూతమయిన మంచి నందరకూ మీరు పంచి పెట్ట జూడుడు. ఇతరులకు మీరు చేయుచున్న సాయమెట్టిది, ఎంతటిది యన్నదే మీరు చూడవలసిన ముఖ్యాంశము అని చెప్పిరి. నేనటులనే చేసితిని. ఏ యాహార పదార్థములు జీర్ణముగాక బాధపడు నే నారోజు నుండి ఆ భయమునుండి విముక్తుడనయితిని.

నిర్భీతితో నాహారమును తీసికొనుట వారి యనుగ్రహము వలన జరుగు చున్నది. ఇలాటి సలహాలను శ్రీవారందరు శిష్యులకూ తప్పక ఇచ్చేవారు. శ్రీవారే స్వయముగా రోగులుగా నున్నవారికి జామపండ్ల వంటి పదార్థములను తినమని ఇచ్చెడివారు. ఆ ఇచ్చిన దానిని వరప్రసాదముగా శిష్యులు గ్రహించి కనుల కద్దికొనేవారు. ఇప్పుడు గుంటూరు మొదలగు యోగా సెంటరులకు వచ్చే సాధకుల మేమీ విధముగనే చెప్పుచున్నాము.

యోగాభ్యాసమునకు వచ్చు డాక్టర్లు ఏదో బాధతోనే వచ్చేవారు. ఆ బాధలు వారి వైద్యశాస్త్రము యొక్క తోడ్పాటుతో ఎంత మాత్రము తగ్గకపోవుట వలననే ఈ ప్రార్థనకు వచ్చేవారు. వుబ్బసము, మొలలు మొదలయిన వ్యాధులు వారి వైద్యవిధానము వలన తగ్గిపోయేవి కావని వారి గురువులు చెప్పగా విన్నారు. కనుక వారికి ఈ ప్రార్థన వలన తప్పక మంచి లాభము కలుగుననే నమ్మకము ఉండదు. ఏదో కొద్ది పాటి ఆశతో మాత్రము వచ్చి కూర్చుంటారు కనుక ఇట్టి వారితో వేగటం కష్టము.

అంచు మొలల వ్యాధితో బాధపడువారి యనుభవమును చూద్దాము. రెండు వారములుగా వారు ప్రార్థన చేసికొన్నారు. కాని కొద్దిపాటి మార్పు మాత్రమే వచ్చినది.

నే నిలా ప్రశ్నించితిని : "మీరు నమస్కారము పెట్టుకొని నపుడు ఈ వ్యాధి తగ్గదు అనే భావముతోనే నమస్కారము పెట్టుకుంటున్నారు." దానికి డాక్టరు ఇలా చెప్పేడు. 'అలాటి సందేహము నాకు కలుగుచున్నమాట వాస్తవమే.'

నేను : మీరు మీ చదువును మీ ఆలోచనలను ఒక ప్రక్కకు నెట్టి వేయండి. మనకు వచ్చిన అధి వ్యాధులు తొలగుట అన్నది మన చేతిలో లేదు. ఆ వ్యాధులు

వచ్చుటకు కల కారణము మనకు తెలియదు. ఆ వ్యాధులు పోవుటకు గల కారణములు మనకు తెలియవు కనుక అది యంతయు మాష్టరుగారికి వదిలి వేద్దాము. ఈశ్వర కరుణామృతము వలన మాత్రమే ఇట్టి మంచిపనులు జరుగును. కనుక అంతయు మాష్టరుగారికి వదిలి వేద్దాము. బాధలు తొలగినపుడూ సంతోషమే. ఆ బాధలు తొలగుటలో ఆలస్యము జరిగినను సంతోషమే. కనుక మీరు మనస్సును ఎలాంటి సంకోచము లేక స్వేచ్ఛగా వదలి వేయండి. అంతయు ఆ దైవాను గ్రహమునకు వదలి వేద్దాము. మనము నమస్కారముపెట్టి చూస్తూ కూర్చుందాము. వారు దానికి అంగీకరించిరి. రెండు మూడు రోజులలో వారి బాధలు అన్నియు క్రమముగా సర్దుకొని పోయినవి. వారు చాలా సంతోషించిరి. అప్పుడొక ప్రశ్న ఉదయించెను మనము మాష్టరుగారికి ప్రార్థించినపుడే మనలోని బాధలు తగ్గిపోవు చున్నవి ప్రార్థన చేయనపుడు బాధలు వచ్చుటయున్నూ, ప్రార్థన చేసినపుడు తగ్గుటయున్నూ ఎట్లు పొసగును. ఇది మందులు తిన్నప్పుడు సుఖముగా నుండుటయున్నూ, తినుట మానివేసినపుడు మరల బాధలు ముసురు కొనుటయున్నూ జరుగుచుండును. ఈ యోగ సాధన కూడ అలాటిదేనా ?

ఇది అచ్చముగా ఒక డాక్టరు ప్రశ్న : అది ఎంత మాత్రము గాదు. ఈ వ్యాధులు బాధలు వచ్చుటకు కారణము మనకు తెలియదు. పోవుటకు కారణము అసలే తెలియదు. మనము ప్రార్థన చేసికొన్నప్పుడు బాధ తగ్గును. ఎలాంటి ప్రార్థన చేయని వారికి కూడ బాధలు వచ్చుట, తగ్గుట కలదు. కనుక ఈ ప్రార్థనను ఈ పద్ధతులలో ఈ సమయాలలో చేయుట వలన మనకు వ్యాధులు తొలగిపోయినవి అనుట సరికాదు. ఈ సాధన అంతటికి వెనుక ఒక సద్భావము నిలిచియున్నది. అది ఆ భావము ఇతరుల యెడ ప్రేమగా, సానుభూతిగా మనలో విజృంభించును. ఆ విజృంభణము వలన ఇతరులకు ఏదో సహాయము చేయవలయును అను ఆకాంక్ష బయలుదేరును ఆ ఆంక్షయే అపేక్ష. అదియే ప్రేమ యొక్క శక్తి కేంద్రము. దాని వలననే ఈ ప్రార్థన చేయుట, మొదలయిన కార్యక్రమములన్నియు బయలుదేరును. దానిని "*Urge*" అందురు. ఆ ఆకాంక్ష చాలా శక్తివంతమగు కేంద్రము. మనము ఆ కేంద్రము నుండి పనిచేయుట నేర్చుకొన వలయును. అప్పుడు ఈ ప్రార్థనను, ఈ రూపములో చేయనక్కర లేదు! మాష్టరుగారూ ఈ బాధలు తగ్గించండి అని అన్న మాటల రూపమున

మనము ప్రార్థించ నక్కరలేదు. ఆ ఆకాంక్ష వలననే అనగా "*Urge*" వలననే మన బాధలన్నీ తొలగిపోవును. డాక్టరుగారు ఈ చెప్పిన దానిని చాల శ్రద్ధగా వినెను. వారికి ఈ భావము అందలేదు. వారిగురువులు చెప్పిన వైద్య శాస్త్రములో ఈ భావమునకు చోటులేదు. కనుక ఆయన యేమియు మాట్లాడలేదు. తరువాత నేను ఇట్లంటిని. ఇది చెప్పగనే తెలిసేటంత సులభమైన విషయముగాదు. సాధన చేయండి క్రమంగా తెలుస్తుంది.

మనకు వచ్చుచున్న ఆధివ్యాధుల యొక్క బాధలు తొలగిపోవుటకుగాను ప్రార్థన చేసికొనుట తప్పని సరిగా అవసరమా? అన్న సందేహము అందరకు వచ్చును. నాకును అలాటి సందేహము వచ్చెను. ప్రతిరోజూ సాయంకాలము ప్రార్థన సమయంలో కొందరు వచ్చి ప్రార్థనలో పాల్గొందురు. వారివారికివున్నట్టి బాధలన్నీ తొలగిపోవుటయున్నూ జరుగును. అప్పుడు ఆప్రార్థనలో కూర్చున్న మేము అక్కడనున్నవారి అందరియొక్క బాధలు తొలగిపోవలెనని ప్రార్థనచేసి కొనుట పరిపాటి. అట్లుప్రార్థన చేయుట అవసరమా ? అని సందేహము వచ్చిన రోజున ఆ పద్ధతిగా ప్రార్థన చేయుటను మానివేసితిమి. అందరమూ ఊరికే నిశ్శబ్దముగా కూర్చుంటిమి. ఏ సంకల్పము లేకుండా ఊరక విశ్రాంతిగా మాష్టరు గారిని గురించి తలపోయుచు కూర్చుంటిమి. ప్రార్థనా నంతరము ఎవరి ఇండ్లకు వారు వెళ్ళి పోయిరి. అలా కొన్ని రోజులు వరుసగా పరిశీలించి చూసితిమి. అందరి బాధలు మామూలుగా తొలగిపోవుచునే యున్నవి. కనుక మనము కోరినను కోరకున్నను ఆ ఈశ్వర కరుణామృతము మనలో ప్రవేశించి పనిచేయుచునే ఉండును. అందరి క్షేమమును కోరే ఆకాంక్షయే అందరిలోను ఆనందమును నిలుపును. ఇచట ఇంకొక అనుభవమును గురించి కూడా తెలిసికొన వలయును.

మాగ్రామములో నున్న సాధకులలో ఎవరికైనను జబ్బుచేసి నపుడు ఆ విషయమును శ్రీశాస్త్రిగారికి తిరుపతికి జాబువ్రాసేవారము. ఆ వ్రాసినజాబు పోస్టుడబ్బాలో వేసేవారము. ఆ జాబు శ్రీశాస్త్రిగారికి చేరుటకు రెండుమూడు రోజులు పట్టును. కాని ఆ జాబు ఇక్కడ పోష్టు డబ్బాలో ఉండగనే ఆ రోగికి రోగబాధ తగ్గిపోవుట ఆరంభమయ్యేడిది. ఆ సాయంకాలమునకే ఆరోగి రోగ విముక్తుడై హాయిగా తిరిగెడివాడు. అనగా శాస్త్రిగారు మన జాబును చూడక ముందే రోగ నివారణ జరిగి పోయెడిది అని అర్థము. ఇందుకు కారణము శాస్త్రి గారిలో ఉన్న అపారమగు ప్రేమయే ననిన్నీ ఇతరులకు ఆనందము కలుగవలె నన్న వారి ఆకాంక్షయే ముఖ్యమగు కారణమనిన్నీ తెలిసికొన గలము.

# మాస్టర్‌గారు - మదర్‌గారు

శ్రీ కొత్త రామకోటయ్య
శ్రీ వి. సంగమేశ్వరరావు



శ్రీ మాష్టరుగారు వెలువరించిన నూతన యోగమునకు శృంఖలరహిత తారక రాజయోగమని పేరిడిరి. ఇందు ఇనిసియేషన్ పొందినవారికి ప్రసరించే యోగ శక్తికి సెంట్రల్ డైనమోలోని ముఖ్య భాగం అమ్మగారే. (ఇకమీదట వెంకమ్మ గారి పేరు వ్రాయక మదరు, లేక అమ్మగారనియు, శ్రీ సి.వి.వి గారిని మాష్టరు అనియు పేర్కొందము).

మదరు, మాష్టరుగారు నిర్వహించిన అన్ని యోగానుష్ఠానములలోను, ప్రముఖపాత్ర వహించిరి. ఈ మాతృశ్రీని యీ మార్గానుయాయులు *T.M.* (ట్రాన్సుమీడియం) అనెదరు. వీరు మాష్టరుగారికి ముఖ్యమగు పనిముట్టుగను, యోగ సాధన విశేషముగను ఉపయోగపడిరి. శ్రీ మాష్టరుగారికి యోగనిష్ఠలో తోచిన భావములు సరియైనవని నిర్ధారణ చేసికొనుటకై శ్రీ మదరుగారిని ***T.M.***గా ఉపయోగించెడివారు. మదరును ట్రాన్సులోనికి పంపించి, ఇతర లోకములందు జరుగు విశేషములను వారిద్వారా తెలిసికొనెడివారు. శ్రీ మదరుగారి శరీరమును ఆత్మనుగూడ మాష్టరుగారు తమ స్వాధీనములో నుంచుకొని, వారి యోగ ప్రయోజనములను మదరుగారిద్వారా నిర్వహించిరి. ఇట్లు మదరు మనస్సును శరీరముచే గాక, చందు, సుందరం (ఒక మీడియం) గారల మనశ్శరీరములనుగూడ మాష్టరు గారుపయోగించెడివారు.

శ్రీ మాష్టరుగారి, మదరు, చందు, సుందరంగారి శరీరములు నాలుగు, నాలుగు బల్బులు. మూలశక్తి మాష్టరు. వారు స్విచ్చి వేసిన యీ బల్బులన్నియు వెలిగెడివి. ఇది వారి యిచ్ఛాధీనం. మాష్టరుగారొక సైంటిస్టు, మదరొక లేబరేటరీ, సుందరం ఒక పనిముట్టు అనగా యిన్స్ట్రుమెంటు. ఈ యోగ లేబరేటరీలో ననేకములగు పరిశోధనలుచేసి, దివ్య ఉద్బోధములు యితరుల కందించెడివారు. శ్రీ మాష్టరుగారి సహధర్మ చారిణి — శ్రీవారు ఫిజికల్ లెవెల్‌లో పని చేస్తుంటే — మదరుగారు యాస్ట్రల్ లెవెలులో పనిని నిర్వహించెడివారు. ఎల్లప్పుడూ యోగ నిష్ఠలో వారి శరీరము, మనస్సు, ఆలోచనలు, తన్మయమై యుండెడివి. వారి సంసారము — ఇంటిగొడవలు చాల అప్రధానముగ ఆమెచే చూడ బడు చుండెడివి. మాష్టరుగారు ఫిజికలు చాలించిన కొన్నాళ్ళకు మదరు నవ్వుచు "శ్రీరాములవారు సీతమ్మను పరిగ్రహించినది ప్రాపంచిక సౌఖ్యములకా? కాదు ; వారెన్నో కష్టముల నెదుర్కొనినారు. ఒక ధర్మపరిపాలనకై యడవుల బడి, విడివడిరికదా ? ఈ యోగధర్మమునకై మేమిరువుర మెంతో యలజడి పడితిమి. వారు విడివడి పోయినట్లున్నను నన్నిప్పుడు వారే నడిపించుచున్నారు.

మణిమందిర-ఆగస్టు. '88

ఏవేవో బోధలు వచ్చుచున్నవి పోవుచున్నవి. అదియంతయు మాష్టరుగారి సంకల్పము. నాదేమియులేదు." అనెడివారు.

మదరుగారు - మాష్టరుగారు ఫజెటు వదలిన 1922 నుండి 1940 వరకు అనగా 18 సంవత్సరములవరకు యిది, యది అని వర్ణింప వీలుగానటువంటి యోగస్థితిలో నుండిరి. ఏ ప్రాపంచిక విషయములందును గృహ విషయములందును శ్రద్ధ యుండెడిదిగాదు. ఎల్లప్పుడు యోగసాధనలోనే యుండెడివారు.



# మాస్టర్‌యోగ సమాచారము

Master C.V.V. Born on 4-8-1868 10-20 A.M.
KUMBHAKONAM.

12th year marriage with Rukminamma garu
(3 sons, 3 daughters)

Demise of Rukminamma garu 1904

38th year marriage with Venkamma garu 1906
(2 sons, 2 daughters)

Mother's (Venkamma garu) Birth 28-9-1894 (10.30 P.M.)
(Jaya—Perattasi 9 tidi)

First son Chandu's Birth 13-4-1909
Demise 10-6-1910

Yoga Experience—May 1910

Touch of M and MTA Levels 28-5-1910

Touch of Halley's Comet 29-5-1910

Link with Origin 8-30 P.M. 30-5-1910
(Commencement of Yoga)

Sukra Planet yielded
Merry Life Day 26-7-1918

Ten year working advice
7.45 P.M. 30-5-1920

Physical Disappearance of
Master C.V.V. 12-5-1922 (3·00 P.M.)

This Experimental Yoga was first started in May 1910 with the following six Mediums.

1. C. Venkasami Rao (Master C.V.V.)
2. C. Venkamma (Mother)
3. C. Venkata Rao (S/o Rukminamma)
4. Rama Rao
5. Chandu
6. Sundaram

## యోగ కేంద్రములు

'మాస్టర్ వర్తిల్లిన సర్వ స్థలాంకి మాహాత్మ్యముంటుంది' [వే. ప్ర.]

కుంభకోణము (మాస్టర్ జన్మించిన నగరము); మదరాసు (మదర్ వెంకమ్మగారు జన్మించిన పట్టణము); తిరుపతి (మదర్ వెంకమ్మగారితో మాస్టర్‌గారి వివాహము జరిగిన నగరము) శ్రీప్రభాకరులు నివసించిన గృహమునందే మాస్టర్ గారి వివాహము జరిగినది. ["మాస్టర్‌కు ఈ ఇంటిలోనే వివాహము జరిగినది" —వే.ప్ర.]

## సుప్రసిద్ధ యోగసాధన కేంద్రములు మరికొన్ని

ఒంగోలు, బాపట్ల, పిడుగురాళ్ల, నిడుబ్రోలు, తెనాలి, గోవాడ, గురజాల, గుంటూరు, విజయవాడ, విశాఖపట్టణము, హైదరాబాదు (చూ. వివరాలకు యోగ విస్తరణము—శ్రీ వి. సంగమేశ్వరరావు—పు. 174—182—భృక్తరహిత తారక రాజయోగము, నిడుబ్రోలువారి ద్వితీయ ముద్రణము 1971).

## యోగసాధన - సమావేశములు జరుపుచుండిన కొన్ని కేంద్రములు, ప్రచురణ సంస్థలు

| | |
|---|---|
| YOGA SCHOOL FRIENDS SOCIETY | —East Dabir Street, Kumbhakonam |
| " " | —Renade Hall, Luz, Mylapore, Madras. |
| Master Yoga Centre | —88, Sir Thyagaraya Road, T· Nagar, Madras-17. |
| Master C.V.V. Yoga Centre | —No. 3. Aryagowder Road Extn, West-Mambalam, Madras. |
| Yoga School | —Piduguralla, Guntur Dt. |
| Master Yoga Centre | —Bellary. |
| Master C.V.V. Yoga School | — 55 P & T. Colony, Gandhinagar, Hyderabad-500380 |
| Sri Master C.V.V. Yoga Centre (Branch) | —12, R.N. Mada. St. Tirupati-517501. |
| Sri Prabhakara Mitra Mandali Publications | —12, R.N. Mada St, Tirupati-517501. |
| Bhrikta Yoga Publications | —R M S Colony, Tadepalli, A.P. |
| Bhrikta Yoga Publications | —88, Sir Tyagaraya Road, Madras -17. |

| | |
|---|---|
| Bhrikta Yoga Publications | —Ogiralavari Street, Satyanarayanapuram, Vijayawada-3. |
| Sarvari Publications | —Plot No. 55, P & T Colony, Gandhinagar, Hyderabad-500 380. |
| Bhrikta Rahita Taraka Rajayoga Mandali | —M.N. Branch, Ongole. |
| World Friendship Series | —Renade Hall, Luz. Mylapore, Madras. |
| Yoga Prabha Publications | —94, B, Prakasam Road, Tirupati -517501. |
| Bhrikta Rahita Taraka Raja Yoga Mitramandali | —Guntur, A.P. |
| యోగనిలయము | —వేలూరు, ఉత్తర ఆర్కాడు జిల్లా. |

## కొన్ని పత్రికలు—పత్రావళి

| | | |
|---|---|---|
| 1. | News letters | -Run by the Yoga School Friends' Society, Kumbhakonam. 1944—45 |
| 2. | Master Yoga Journal (Qly) | -Run by Master Yoga Centre, Madras, 1971—72 |
| 3. | Yoga Darsani (Qly) | -Run by Master C.V.V. Yoga Centre, Hyderabad. 1983—84. |
| 4. | Manimanjari (Hly) | —Run by Veturi Prabhakara Sastri Memorial Trust, Hyderabad, 1981—86 |

5. **Yoga Margam (Qly)** —Edited by
Sri Vasili Vasanth Kumar
Master C. V. V. Yoga School
Gandhi Nagar Hyd - 500380
1984—85

## గ్రంథావళి

| | | |
|---|---|---|
| **Kundalini** | —T.S. Ramanujam | 1938 |
| **Physical Immortality** | —T.S. Ramanujam | 1940 |
| **The New Yoga** | —S. Narayana Aiyer | 1943 |
| ప్రజ్ఞాప్రభాకరము | —వేటూరి ప్రభాకరశాస్త్రి | —1961 |
| నూతన ప్రవిభాగము | —పోతరాజు నరసింహంగారి ఆంగ్ల గ్రంథమునకు తెలుగుసేత —గాలి బాలసుందరరావు | -1970 |
| ప్రభాకర ప్రవచనములు | —కొత్త రామకోటయ్య | 1951 |
| **Bhrikta Yoga (The New Dispensation)** | —P. Narasimham | 1971 |
| **Discovery of Master Yoga** | —Sarvari | 1971 |
| **Prayers & Courses Compilation** | —Ed. V. Vasantakumar | 1983 |
| యోగలేఖలు | —సంపాదకుడు టి.పి. భాష్యకారాచార్యులు | 1983 |
| భృక్తరహిత తారకరాజయోగము | —(సంకలితము) కొత్తరామకోటయ్య, వి. సంగమేశ్వరరావు | 1967 |

వ్యక్తరహిత తారక రాజయోగము —(సంకలితము) కొత్త రామకోటయ్య
ఐ. సంగమేశ్వరరావు 1971

జిజ్ఞాసువులకు సూచన —నాగలింగం వెంకటేశ్వరశాస్త్రి
**(Tr. of information for Inquirers by Master C. V V.)**

గృహస్థు-ఆధ్యాత్మికత —జంపాల పార్థసారధి
**(Tr. of Sex and Spirituality by P. Narasimham)**

యోగాశ్రమ లేఖలు —శారదంతి 1976

శ్రీగురుగీత —శారంతి 1986

గురుపూజ (ప్రజ్ఞాప్రభాకరము-*II*) —కొత్త రామకోటయ్య
1977—78 (మణిమంజరిలో ప్రకటింపబడుచున్నది)

**World Teachers Trust Publications on Yoga** —ఎక్కిరాల కృష్ణమాచార్య

మాస్టర్ సి వి.వి. — ఎక్కిరాల కృష్ణమాచార్య

వ్యక్తరహిత తారకరాజయోగము మంత్రార్థ వివరణము —కొత్త రామకోటయ్య 1985

**Notes :** **—Master C. V. V. Vol I 1983**

**Notes :** **—Master C. V. V. Vol, II 1984**

Pragna Prabhakaram (Tr. of The auto biography of Veturi Prabhakara Sastri) — V. Anandamurti, Manimanjari Volumes 1981-85

ప్రేయరు — *Dr. G.L.N.* శాస్త్రి 1983

మా శాస్త్రిగారు — కొత్త రామకోటయ్య 1956

శృత్తరహిత తారక రాజయోగము —పరిచయము — పిన్నమనేని వెంకటపున్నయ్య

మాస్టర్ యోగదర్శిని

మాస్టర్ సి.వి.వి. ఎవరు ? — సంపా. వాసిలి వసంతకుమార్

## ముద్రిణమందిన కొన్ని కోర్సులు-రెగులేషన్లు

Moon Regulations : The Yoga School-Kumbhakonam 1919

| | | | |
|---|---|---|---|
| Mars Regulations | " | " | 1920 |
| Budha Regulations | " | " | 1920 |
| Guru Regulations | " | " | 1921 |

Simple Course

Auri Course

Merchery to T course

Prayers and Courses - Master C.V.V. Yoga School
Hyd - 500380.

(ఇవి కాక యోగమిత్రులలేఖలు, అనుభూతులు మరికొన్ని మా సేకరణమున యోగా ఫైలులో కలవు — సం॥.)



యోగాస్కూల్
ఫ్రెండ్స్ సొసైటీ
కుంభకోణము



శిష్యబృందముతో మాస్టర్ సి.వి.వి. - కుంభకోణము

# వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

**కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య**

ఆంధ్రలోకమునందు అక్షరాస్యులలో వీరి పేరు విననివారుండరు. ఆంధ్ర వాఙ్మయవార్ధిని మథనముచేసి అముద్రితగ్రంథముల ననేకములను పరిష్కరించి, వెలుగులోనికి దెచ్చి చక్కని పరిశోధన నెలకొల్పి, నిర్మాణాత్మక విమర్శనములతో ఆంధ్ర భారతి నలంకరించిన వేటూరి ప్రభాకరశాస్త్రిగారు మాస్టరు సి.వి.వి. గారి మార్గమునకు ప్రధాన ప్రవర్తకులలో నొకరని యెరిగినవారు చాల తక్కువ.

ప్రభాకరశాస్త్రిగారు మాస్టరుగారి మార్గమున కాకర్షింప బడిన విధానము చిత్రము. "ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ" అని శ్రీకృష్ణుడు చెప్పినట్లు, మానవుడు ఆర్తుని గనో, జిజ్ఞాసువుగనో, అర్థార్థిగనో భగవంతుని సమీపించుటకు బయలు దేరును. ప్రభాకరశాస్త్రిగారు మదరాసులో గ్రంథాలయమున పనిచేయుచుండిరి వారు చిరకాలమునుండి అనివారణీయమైన జీర్ణకోశవ్యాధితో బాధపడుచుండిరి. అనేక వైద్యవిధానములు నిష్ఫలమయ్యెను. జీవితముపై నాశ లేక నిరుత్సాహియై వారు వ్యథతో సంచరించుచుండిరి. అప్పుడు శ్రీ పోతరాజు నరసింహము (ప్రెసిడెన్సీ కాలేజీ ఫిలాసఫీ ప్రొఫెసరు) వారి అనారోగ్యమును గూర్చి ప్రశ్నించి మాస్టరుగారి యోగగోష్ఠిలో జేరవలసినదని సలహా నిచ్చిరి. అంగీకరించినచో పరిచయపత్రమును వ్రాసియిత్తు ననిరి. ప్రభాకరశాస్త్రిగారికి వెంటనే మనస్సు ప్రసన్నమై జీవితమున కొక బాట యేర్పడుచున్నట్లు పొడకట్టెను. వారు వెంటనే పరిచయ పత్రమును స్వీకరించి ఆరోజు సాయంకాలమే కుంభకోణమునకు బయలుదేరిరి. మరునాడుదయము కుంభకోణమున దిగి, కాలకృత్యములు తీర్చుకొని, మంచి మామిడిపండ్లు కొని, గుర్రపు బండిమీద బయలు దేరిరి. బండివాడు మాస్టరుగారిని బాగుగా నెరుగునట. అతడు గురుదేవుల ఘనతను కథలుగా వినిపించుచు వారి

యింటికి గొనిపోయెను. వాకిట కాషాయములు ధరించిన సన్యాసి యొకరు మాస్టరుగారి శిష్యులు యెదురు వచ్చి ఆదరించి లోనికి గొనిపోయెను. మాస్టరు గారితో చెప్పి వెంటనే దర్శనము నేర్పాటుచేసెను. ఆ సన్యాసి పేరు సచ్చిదానందేంద్ర సరస్వతీస్వాములవారు. పూర్వాశ్రమమున బందరు వాస్తవ్యులు. ప్రభాకరశాస్త్రిగారికి కలిగిన మాస్టరుగారి ప్రథమ దర్శనము వారి వాక్యముల మూలముననే తెలియవలెను:

'లావుగాక, సన్నముగాక. హాయిగా నిద్రపోయితిని.''

(సూ. ప్రజ్ఞాప్రభ, పుటలు 19–22)

మరునా డుదయమున ప్రభాకరశాస్త్రిగారు మాస్టరు గారితో ''నేనిక్కడ మీ సేవకుడనుగానే యుండగోరుచున్నాను; అనుగ్రహింపుడు'' అని వేడుకొనిరి. అప్పుడు మాస్టరుగారిట్లు పలికిరి: "బండి నడచుచుండగనే రిపేరు సాగవలెను. బండి ఊడదీసి చేసినచో బండివాని జీవిక చెడును. నా యోగ మార్గమున సాగుచున్న ప్రవృత్తికి భంగము కలుగరాదు. ఇది నివృత్తి మార్గము కాదు. రాజయోగ మార్గము. గార్హస్థ్య ముండవలెను. సన్యాసి కారాదు. సౌఖ్యము లుండవలెను. ఆరోగ్యవంతుడవై ఉద్యోగమున నుండి యోగము సాధించుకొనుము. నేను సదా నీలో నుందును. నీకు వలసిన సహాయము నీలో నుండి జరుపుచునే యుందును. ఉదయము జరిపిన యోగసాధనము సాయంకాలము దాక పని చేయుచునే యుండును. ఎప్పుడెంతెంత జరుగవలెనో అంతంత జరుగును. ........ .... .... ప్రయాణములో, రైలులో, బండిలో, నడకలో, ఇంకేమైన వ్యవహారములలో వర్తిల్ల వలసి వచ్చినపుడు సరియైన వేళ తప్పిపోకుండ ఒక క్షణమాత్రము మనసును స్మరించిన చాలును. కార్యాంతరములు తీరి విశ్రాంతి దొరికినపుడు జరుగ వలసిన సాధన జరుగును. .... .... వివేకమును, సత్యమును, ధర్మమును గుర్తించుకొనుచు, నంతరాత్మ నారాధించుచు, లోలోన జొచ్చు కొలదిని నీకు వలసిన యుద్బోధములు లభింపగలవు. ముందు నీ కారోగ్యము ముఖ్యము. తరువాత యోగసాధనము లభించును. గాఢముగా విశ్వసించినచో నీకు యోగ ఫలము లభించునని నేను చెప్పను. నీకా విశ్వాసమును గూర్చవలసిన వాడను నేనే .... .... .... .... వీలు కలిగినపు డిక్కడికి వచ్చుచుండుము. ప్రధానముగా డిసెంబరు

తుది వారముననో, మే తుది వారముననో యిక్కడ గోష్ఠి జరుగును. అప్పుడు తప్పక రమ్ము'' అని సెల విచ్చిరి. అప్పుడు శాస్త్రిగారి కనుల వెంట బాష్ప ధారలు వర్షించెను ఎండిన పొలముపై తొలకరి చినుకులై మాస్టరుగారి పలుకులు వారి భవతాపమును హరించి, శరీర మను క్షేత్రమును మాగాణిగా సాగుబడి జేసి, ఆనంద బీజములను పండించెను. నిర్భరమైన ఆనందానుభూతితో, తడబడుచున్న పలుకులతో, ఆనందగద్గద కంఠముతో నీ విధముగా దేవభాషలో గురుస్తుతి చేసిరి.

"దుర్వ్యాధిఖిన్నే శరణం ప్రపన్నే
మయి ప్రసాదా దయి మాస్మ భైషీః
త్రాతాహ మస్మీతి దదావ భీతిం
య స్తం గురుం మస్తకతో నమామి.'

ఆనాడు శాస్త్రిగారు స్వగతముగా నిట్లని యచ్చెరువు పడిరి. ''శరీరమున నింత తీవ్ర సంచలన మేమి? దీని కారంభ మెక్కడ? ఇంతదాక నెన్ని శ్లోకములో, యెన్ని మంత్రములో, యెన్ని ధ్యానములో, యెన్ని క్షేత్రములో, యెన్ని దేవతా దర్శనములో, యెందరి యాశ్రమములో జరిపితిని గాని, యిట్టి విశేష మెక్కడ నెప్పుడు జరుగుట యెరుగనైతినే? ఒక తూరి ప్రార్థనా మాత్రముచే నింత జరు గుట యేమిది? అస్తి నాస్తి విచికిత్సా స్పదముగా నున్న పరతత్వము, అస్తి అని స్పష్టముగా ననుభవింపనగుచున్నట్లున్నది. దీని లోతేదో తెలుసు కొనవలెను. నా ప్రార్థనమును లోన నెవరో వినుచున్నట్లు, సమాధానము చెప్పుచున్నట్లు, అను గ్రహించు చున్నట్లు నగుచున్నది.''

తిరిగి వచ్చుచున్నపుడు శాస్త్రిగారు రైలులో త్రొక్కిడిగా నుండగా తలుపు దగ్గర నిలబడిరి. ఎవరో త్రోసినట్లై కంపము కలిగినది. లోపల కూర్చుండిన ప్రయాణీకులలో నొకడు లేచి ''తలుపు తెరచి యున్నది, క్రింద పడగలరు. ఇటువచ్చి కూర్చుండుడు. నేను పై స్టేషనులో దిగిపోవుదును." అని కూర్చుండ బెట్టెను. శాస్త్రిగారు సుఖముగా నింటికి తిరిగి వచ్చిరి. అనతి కాలము లోనే వారికి తంజావూరు లైబ్రరీలో పరిశీలనోద్యోగము లభించెను. రొట్టె విరిగి నేతిలో పడినట్లు పరమోత్సాహమైనది. అప్పటి నుండి కుంభకోణము చాల దగ్గర.

అప్పటినుండి ప్రతివారము కుంభకోణము వెళ్ళి మాస్టరుగారిని దర్శించుట కనుకూలం పడెను. అటుపైన క్రమముగా శాస్త్రిగారి ఆరోగ్యము కుదుటబడెను. మాస్టరుగారి యోగమార్గమున వారు పారంగతులై దివ్య ప్రేమానుభూతిని అనుక్షణ మనుభ వించుచు జీవిత శేషమును గడిపిరి ఆ ప్రేమ ప్రవాహమున ప్రభావితులైన వారు అసంఖ్యాకులు గలరు. మాస్టరు సి.వి.వి. గారితో పాటు తమ యిలవేల్పుగా శాస్త్రిగారిని నేటికిని కొలిచి తరించుచున్న వారు కలరు. తిరుపతిలో నివాస మేర్పరచుకొనిన తరువాత అచట చక్కని మిత్రమండలి యేర్పడినది. మాస్టరు గారి అనుగ్రహమున రోగార్తులకు అసంఖ్యాకులకు శాస్త్రిగారు రోగోపశమనము చేసిరి. వారు బొట్టు పెట్టి *Prayer* చేసినచో దుస్సాధము లైన వ్యాధులు ఔషధ ములతో నిమిత్తము లేకయే ఉపశమించినవి. దేశము నలుమూలల నుండి రోగా ర్తులు వారికడకు వచ్చి రోగశాంతిని పొందుటతో నాగక, మాస్టరుగారి దివ్య యోగానుభూతిలోనికి ఆకర్షింపబడిరి. నేటికిని సి.వి.వి. గారి యోగసాధకులలో వీరి శిష్యులందొక ప్రత్యేకత గోచరించు చుండును. అది వినయ విధేయతలతో గూడిన ఋజు మార్గ ప్రవర్తనము, నిరాడంబర జీవితముతో కూడి యుండును. ఒకప్పుడు శాస్త్రిగారు తమ ధర్మపత్నితో కుంభకోణమునకు పోయిరి. ఆనాడు సాయంకాలము యోగాభ్యాసము ముగిసిన తరువాత మాస్టరుగారు శాస్త్రిగారిని పిలిచి యిట్లు చెప్పిరి.

"ఈ రాత్రి నేను విశ్రమించు........ ఇన్‌సియేషన్ జరగినది."

(చూ. ప్రజ్ఞాప్రభ — పుటలు 38-40)

నాటినుండి శాస్త్రిగారి ధర్మపత్ని మాస్టరుగారి యోగమండలిలో నొకరైరి. ఆమె యోగసాధనకు ముందు ఆహారము తీసికొనకుండ నారంభించెను. ఉపదేశము పొందగనే ఐదు నిముషములలో శరీరమెల్ల కొయ్యబారి బిగిసికొనిపోయెను. సచ్చి దానందస్వాములవారు పిలిచినను కనులు తెరువదాయెను. మాతృశ్రీ (వెంకమ్మ గారు) వచ్చి, వెంటనే లేపి ఒడలు పిసికి, యెరుక తెచ్చి, ఆహారము నిచ్చి మరల సాధనము చేయించిరి. పావుగంట సేపు ప్రబలముగా సాధన జరిగెను. అంత తీవ్రముగా జరుగుటకు కారణము శ్రీవారి ప్రజ్ఞా తీవ్రతయే. నాటినుండి ఆ దంప తుల జీవిత మంతయు చైతన్యవంతముగా విశ్వప్రేమమయముగా సాగెను. వారి సాన్నిధ్యమున నెందరో మాస్టరుగారి మార్గమున తరించిరి. వారి దివ్య జీవితము

నందలి అనుభూతులను శాస్త్రిగారు 'ప్రజ్ఞా ప్రభాకరము' అను గ్రంథమున పద్యాత్మకముగా రచించిరి. ఇదిగాక సాధన విశేషానుభూతులను గూర్చిన సవిస్తరమైన మరియొక గ్రంథమును శాస్త్రిగారు రచించినట్లు జనశ్రుతి గలదు. ఆ గ్రంథము వ్రాతప్రతి యిప్పు డెచ్చట నుండెనో తెలియదు. శాస్త్రిగారి భూత దయ, విశ్వమానవ సేవ, దినచర్య, మిత్రధర్మము మున్నగు నంశములను గూర్చి పూజ్యమిత్రులు, కొత్త రామకోటయ్యగారు ''మా శాస్త్రిగారు'' అను గ్రంథమున రచించియున్నారు. నేటికిని రామకోటయ్యగారికి నిత్య ప్రార్థనలలో శాస్త్రిగారి సాన్నిధ్యము అనుభవ మగుటయు, పద్యగద్యాత్మకములైన నూతన సందేశములు, సూక్తులు లభించుచుండుటయు మే మెరుగుదుము.

శ్రీ శాస్త్రిగారి కరుణాప్రసారము వలన రామకోటయ్యగారి జీవితమున ఒక నూతనాధ్యాయము ప్రారంభ మగుట మే మెరుగుదుము. దాని క్రమ మిట్లున్నది. 1970 మే నెలలో రామకోటయ్యగారు విశాఖపట్టణము వచ్చినపుడు ఒక నాటి మధ్యాహ్నము మేమిరువురము మా యింట సల్లాపగోష్ఠిలో నుంటిమి. ఎండ తీవ్రముగా నుండెను. అరవిందుని యోగ దర్శనమును గూర్చి సంభాషించు చుంటిమి. అరవిందులు రచించిన 'సావిత్రి' యను ఆంగ్ల పురాణ కావ్యమును గూర్చి ప్రసక్తి వచ్చినది. వారు దాని నొకమారు చూడవలెనని కుతూహలపడిరి. నే నా మరునాడే మా లైబ్రరీనుండి గ్రంథమును తెప్పించి యిచ్చితిని. వారిట్లు పలికిరి. "ఈ గ్రంథము చాల క్లిష్టముగా రచింపబడిన దనియు, దీనిని అర్థము చేసికొనిన వారు తేరనియు వింటిని మన కేమి బోధపడును?" వాస్తవమునకు రామకోటయ్యగారికి ఆంగ్లమున గల పరిచయము చాల స్వల్పము. ఈ విషయము నే నెరుగుదును. కాని ఆ క్షణమున నాలో శాస్త్రిగారి స్ఫూర్తిగా నోకి ప్రేరేపింపగా నిట్లంటిని. "మీరు దీనిని చదువుటయే గాదు, అనువాదము చేయగలరని నాకు తోచినది. ఆలోచింపక యుపక్రమింపుడు." అన విని రామకోటయ్యగారు స్వీకరించి, వారి గ్రామమునకు వెడలిరి. అచిరకాలములోనే తెనుగున కనువదించిన మొక భాగముతో తిరిగి వచ్చిరి. పద్యగద్యాత్మక మగు ఆ విశ్రుతానువాదము మానవాతీతమైన రీతిలో క్లిష్టమైన భావ పరంపరలకు, సరళమైన అనువాద స్రవంతిగా రూపొందినది. సంవత్సరము తిరిగి వచ్చునరికి అనువాదమును పూర్తి చేసిరి. "మీరు పాండిచేరి పోయి మాతను దర్శింపుడు'' అని చనువుతో నాజ్ఞా

పించితిని. మాత కడు వృద్ధురా లయ్యేననియు, నెవ్వరికిని దర్శన మిచ్చుట లేదనియు వారు సందేహమును వెలిబుచ్చిరి. "మీ వెంట శాస్త్రిగారున్నారు. మీకు మాత యొక్క ప్రత్యేక దర్శనము లభించును. మిమ్ములను ఆమె పిలువనంపి దర్శన మిచ్చును." అని చెప్పి సాగ నంపితిని. వారు పాండిచేరికి యాత్ర చేసిరి. ఆశ్రమమున మాత భవనము దిగువన వేచియుండగా, నెవరో మేడ మీది నుండి వచ్చి రామకోటయ్యగా రెవరని ప్రశ్నించిరి. తెలిసికొని "మదర్ మిమ్ములను రమ్మనుచున్నారు." అని పిలుచుకొని పోయిరి. ఆమె ప్రత్యేక దర్శన మిచ్చి వందనము చేయించుకొని స్పృశించి ఆశీర్వదించినది. శాస్త్రిగారి కరుణకు నిదర్శన మింతకన్న వెదుకనక్కరలేదు. ప్రస్తుతము రామకోటయ్యగారి అనువాదమును పాండిచేరి వారు పత్రికలో ప్రచురించుచున్నారు. సి.వి.వి. గారి అనుగ్రహము శాస్త్రిగారి రూపమున నెంతమందిపై నిట్లు ప్రసరించు చున్నదో యెవరు చెప్ప గలరు.

## కృతజ్ఞతలు

—ఇందులో ఉదాహరించి ఉద్ధరించిన వ్యాసాంశముల కాకరములైన గ్రంథములను రచించినవారియు, ముద్రించినవారియు సౌజన్యమును కీర్తించుచున్నాము.

—ప్రజ్ఞాపరీక్షాకరము, పరిజ్ఞాపరీక్ష, యోగపరీక్ష ముద్రించు సందర్భమున ముద్రణ వ్యయభారము నాదుకొనుటకై చెరొక ఐదువందల చిల్లర (501 +502) విరాళ మందించిన యోగమిత్రులు సోదరీమణులు శ్రీమతి సుభద్రా వాసుగారికిని, చాగంటి కల్పవల్లిగారికిని మా కృతజ్ఞతలు.

—ముద్రణ సందర్భమున అధికభాగము తామే బాధ్యత వహించి ప్రూఫులు అతి శ్రద్ధతో చూచి, కొన్ని రచన లందించి సహాయపడిన యోగమిత్రులు శ్రీ వాసిలి వసంతకుమార్, శ్రీశార్వరిగారలకు మా ధన్యవాదములు.

"ప్రపంచమంతా తల్లక్రిందులైనాసరే ప్రాక్టీసులో ఆక్షన్ జరుగుతూ దాని వల్ల ఇతరులకు ఉపకారము జరుగుతూ నాకు సచ్చిదానందములు లభిస్తూ ఉండడమును బట్టి నా ముక్కులో ఊపిరి ఆడుతూ ఉండేదాక నేను ఈ మార్గమును విడుచువాడను కాను. ఈ విషయము మార్గశిరశుద్ధమునకు నేను మదరాసు వచ్చినప్పుడు (మీ మేడ మీద) రామానుజమున్ను, యన్.ఆర్.బి వి. కుమారుడు వచ్చి ఉండగా స్పష్టముగా వెల్లడించినాను. ఒకవేళ యన్.ఆర్.బి వి శరీరము విడిచినా నే నిశ్చయమునకు కారణము నాలోని సి. వి. వి. ఆక్షన్‌గానే, ఉంచుకున్నాను గనక చలింపను–అని స్పష్టముగా చెప్పితిని. ఆ నిశ్చయముననే నేను నిలిచితీరుదునుగాక! ఇట్టి ధైర్యము సి.వి.వి. నాకు అనుగ్రహించినారు. వారి మీది ప్రేమ నౌక సహాయమున ఆపత్సముద్రమును గడపగలనుగాక. (వే. ప్ర.)

"*C V.V.* చరిత్ర, వారి యోగ విశేషములు, వారి శిష్యుల విషయములు, శిష్యుల మూలమున ప్రశిష్యుల మూలమున వారు వెలయించు మహామహిమలు, వగైరాలు అన్నీ సర్వ సమృద్ధముగా శక్యమైనంతవరకు సేకరించి వ్రాసి ప్రకటించవలెనని తోస్తుంది." (వే. ప్ర.)